# దేవుని రాకకు ఇది సమయము కాదా?




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు





# దేవుని రాకకు ఇది సమయము కాదా?


<u>రచయిత</u>

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (74) దశ సప్తాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ప్రథమ ముద్రణ : జూలై–2016

ప్రతులు : 1000 వెల : **60 /-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఒక్కడే ఇద్దరు.
75) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
76) దేవుని రాకకు ఇది సమయము కాదా!
77) సాయిబాబా దేవుడా! కాదా?
78) విశ్వ విద్యాలయము
**79) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**80) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**81) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**82) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**

**భాషలో పాండిత్యమును వదలి**

**భావములో పాండిత్యమును చూచువాడు**

**నిజమైన జ్ఞాని**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?
7. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.

*DVD'S*

56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. దంతము-అంతము.
114. మాయ మర్మము- ఆత్మ ధర్మము
115. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**

అనంతపురము టౌన్, A.P.

Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)

మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)

గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)

ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)

క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)

ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)

వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)

చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)

నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)

రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)

కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)

బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)

మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)

జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్‌స్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16469

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 7680065963
9704885964, 9848741703.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘువేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణా ఫార్మా, కాలేజీ రోడ్,
హొస్పేట, బళ్ళారి జిల్లా,
కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# దేవుని రాకకు ఇది సమయము కాదా?

మేము మూడు మతములకు సంబంధించిన జ్ఞానమును ఒకే త్రైత సిద్ధాంతము మీద చెప్పుచున్నాము. త్రైత సిద్ధాంతమును అనుసరించి సృష్ట్యాది నుండి జ్ఞానము చెప్పబడుచున్నది. అయినా నేటి వరకు **'త్రైత సిద్ధాంతము'** అనునదే మనుషులకు అర్థము కాలేదు. అందువలన 'దేవుని రాక' అంటూనే కొందరు ముఖము త్రిప్పుకుంటున్నారు. వారి దృష్టిలో దేవుడు రాడని అనగా పుట్టడని అనుకొనుచున్నారు. దేవుడు మనుషుల మధ్యలోనికి రాడను భావము వారికుండుట వలన ఈ గ్రంథము పేరు కూడా వారికి నచ్చదు. ముఖ్యముగా 'దేవుడు పుట్టడు' అను భావము క్రైస్థవులలోనూ, ముస్లీమ్‌లలోనూ గాఢముగా ఉండుట వలన ఈ రెండు మతముల వారికి ఈ గ్రంథము పేరే నచ్చదు. హిందువులకు మాత్రము 'దేవుడు పుట్టునని' ముందునుంచి నమ్మకమున్నది. అందువలన హిందువులు ఈ గ్రంథమును నమ్మవచ్చును. దేవుడు ఎన్నోమార్లు పుట్టాడనీ, నేడు దేవతలుగా ఎందరినో చెప్పుచున్న వారందరూ దేవుని అవతారమేనని హిందువులు అనుకోవడము జరుగుచున్నది. అయితే అన్ని రకముల దేవుళ్ళు దేవుని అవతారము కాదని వారికి తెలియదు. దేవుడు భూమిమీదికి మనుషుల మధ్యలోనికి రావడము వాస్తవమే, అయినా హిందువులు అనుకొన్నట్లు దేవుడు అవతరించలేదు. దేవుడు తన అవసరము వచ్చినప్పుడు మాత్రమే అరుదుగా వచ్చునుగానీ, హిందువులు అనుకొన్నట్లు దేవత లందరూ దేవుడు కాదు. దేవుడు ఇంతకుముందు ఎప్పుడు వచ్చాడో తెలియని స్థితిలో మనుషులున్నారు. అటువంటి వారికి దేవుడు ఎప్పుడు వస్తాడో ఏమాత్రము తెలియదు.

**ప్రశ్న :- ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో ధర్మములకు ఆటంకము ఏర్పడినప్పుడు, ధర్మములు తెలియకుండా పోయినప్పుడు, అధర్మములు**

**ధర్మములుగా, ధర్మములు అధర్మములుగా మనుషుల మధ్యలో మారి పోయినప్పుడు, తిరిగి ధర్మములను తెలియజేయుటకు, అధర్మములను నిర్మూలించుటకు దేవుడు వస్తానని చెప్పాడు కదా! మీరు దేవుడు ఎప్పుడు వచ్చునది తెలియదని చెప్పుచున్నారేమిటి?**

**జవాబు :–** ధర్మములకు ముప్పు కల్గినప్పుడు, అధర్మములు చెలరేగినప్పుడు దేవుడు వస్తానని చెప్పినమాట నిజమే! అయితే ధర్మములు ఎప్పుడు లేకుండా పోయినవనీ, అధర్మములు ఎప్పుడు చెలరేగినవనీ ఎవరికీ తెలియదు. ధర్మములు బాగున్నాయనే అందరూ అనుకోవడము వలన, అధర్మములు మనుషుల మధ్యలోనికి ఎలా వస్తున్నాయో తెలియకపోవడము వలన, దేవుడు కూడా ఎప్పుడు వచ్చునది తెలియదు. హిందువులకు దేవుడు వస్తాడనీ, అధర్మములను నిర్మూలిస్తాడని తెలిసినా, అధర్మములు ఏవో తెలియక పోవడము వలన దేవుడు ఎప్పుడొచ్చునది కూడా తెలియదు.

దేవుడు వస్తాడని తెలిసినా ఎప్పుడు వస్తాడో తెలియని స్థితిలో హిందువులుండగా, మిగతా రెండు మతముల వారు (క్రైస్థవులు, ముస్లీమ్‌లు) దేవుడు రాడని దృఢనిశ్చయముతో యున్నారు. వారి పెద్దలు అలానే చెప్పారని వారు అంటున్నారు. ముస్లీమ్‌లు, క్రైస్థవులు వారి బోధకులు చెప్పినట్లు వినుచుందురు. క్రైస్థవులకు, ముస్లీమ్‌లకు వారి బోధకుల మాటలే ముఖ్యము. వారి బోధకుల మాటలను పూర్తి సత్యముగా నమ్ముచుందురు. క్రైస్థవులకు, ముస్లీమ్‌లకు వారి గ్రంథములతో ఎక్కువ పరిచయముండదు. వారి బోధకులకు గ్రంథములతో పరిచయముండును. అందువలన వారి బోధకులు ఏమి చెప్పినా గ్రంథములోని బోధనే చెప్పుచుందురని ముస్లీమ్‌లు, క్రైస్థవులు అనుకోవడము జరుగుచున్నది. కొన్నిచోట్ల బోధకులు తమ మతము వారిని గ్రంథములోలేని బోధలను చెప్పి మభ్యపెట్టుచున్నారు.

గ్రంథములో అర్థముకాని విషయముల వద్ద తాము తప్పుదారి పట్టిపోవడమే కాక, తమ మత ప్రజలందరికీ తమకు అర్థమయినదే చెప్పి వారిని కూడా తప్పుదారి పట్టిస్తున్నారు. ఈ విధముగా ప్రజలలో బోధకులమీద పూర్తి విశ్వాసమున్నా, బోధకుల కొన్ని పొరపాట్ల వలన ప్రజలందరూ (ఆ మతస్థులందరూ) తప్పుదారి పట్టిపోతున్నారు. మూడు మతములకు సంబంధించిన మూడు దైవగ్రంథములలో దేవుడు పుట్టనని ఎక్కడా చెప్పకున్నా, బోధకులయినవారు ఆ విషయమును గ్రంథమునుండి సరిగా అర్థము చేసుకోలేక పోవడము వలన, మిగతా వారందరూ 'దేవుడు మనిషిగా మనుషుల మధ్యలోనికి రాడని' అనుకొనుచున్నారు. దానివలన దైవ గ్రంథములలో చెప్పబడిన దేవుని మాట ప్రజల వరకు చేరలేకపోయినది.

**ప్రశ్న :- మూడు మతముల మనుషులకు గురువుల బోధలే ముఖ్యముగా ఉన్నవనుట సత్యమే. అయితే 'దేవుడు పుట్టడను' ఒక్క విషయములో మాత్రము తప్పుదారి పట్టారా? మిగతా విషయములలో కూడా తప్పుదారి పట్టారా?**

**జవాబు :-** మిగతా విషయములలో కూడా కొన్నిచోట్ల అవగాహనా లోపముండవచ్చునుగానీ, ఇప్పుడు మనము తెలియవలసిన విషయము 'దేవుని రాక ప్రజల మధ్యలోనికి ఉన్నదా లేదా!' యనునదే ముఖ్యము. గ్రంథములో దైవసంబంధమైన విషయములు ఎన్నో గలవు. అన్నీ సక్రమముగా అర్థమయితే మనుషులు 'మానవులు' అనిపించుకోరు. మాయ మనిషిలో పని చేయడము వలన మనిషి మానవుడనిపించుకొన్నాడని **"ఆదిత్య"** గ్రంథములో చెప్పుకొన్నాము. **మాయ లేని మనిషి లేడు.** అందువలన అన్ని విషయములు సరిగా అర్థము కాకుండా పోవుటకు వారిలోని మాయ ప్రభావమేనని అర్థమగుచున్నది. గ్రంథములో కొన్ని

పూర్తి దైవ సంబంధ విషయములు యుండగా, కొన్ని మాయ సంబంధ విషయములు కూడా గలవు. దేవుడు అంతా జ్ఞానమునే చెప్పినా, కొన్ని విషయములు మనిషిలోని మాయ వలన అర్థము కాకుండా పోయాయి. అర్థము కాకుండా పోయినవన్నీ మాయ విషయములుగా మారిపోయి మనుషులను తప్పుదారి పట్టించుచున్నవి. మాయను జయించిన వానికి మాత్రము అన్నీ జ్ఞాన విషయములుగానే కనిపించును. మాయ లేనివానికి జ్ఞాన విషయముగా కనిపించిన విషయమే, మాయలో యున్నవానికి అజ్ఞాన విషయముగా బోధపడును. వానికది జ్ఞానముగనే కనిపించినా దేవుని దృష్ఠిలో అది అజ్ఞానముగానే కనిపించును. దేవుడు 'మనిషిగా వస్తానని' చెప్పిన మాటను అర్థము చేసుకోలేక 'దేవుడు రాడు' అనువారు గలరు. దేవుడు మనిషిగా వచ్చి ఎంతో కష్టపడి చెప్పిన విషయములను అజ్ఞానముగా కొందరు అర్థము చేసుకోవడము వలన అటువంటి వారి మీద దేవునికి అయిష్టత ఏర్పడును.

ప్రశ్న :- **దేవుడు మనిషిగానే వచ్చి చెప్పడము ఒక రకమే కదా! ఇంకా రెండు రకములుగా వచ్చునని, మొత్తము మూడు రకములని అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో చెప్పినట్లు కలదు. దీనిని గురించి మీరేమంటారు?**

**జవాబు :-** అంతిమ దైవ గ్రంథములో సూరా 42లో, 51వ ఆయత్‌లో ఇలా చెప్పియున్నారు. **(42-51) "దేవుడు ఏ మానవునితోనూ ప్రత్యక్షముగా మాట్లాడడు. దేవునితో మాట్లాడడము మనిషికి సాధ్యమయ్యే పనికాదు. దేవుడు తన జ్ఞానమును 'వాణి' ద్వారా (వహీ ద్వారా) లేక తెరవెనుక నుండో మనిషికి చేరవేస్తాడు లేదా తాను కోరినది తన ఆజ్ఞతో సూచించడానికి తన ప్రతినిధిని**

**పంపుతాడు. ఆయన మహోన్నతుడు, ఎంతో వివేకవంతుడు."** ఈ వాక్యములో చెప్పినది మూడు విధములుగా జ్ఞానము చెప్పెదనని చెప్పాడు. అయితే ఆ మూడు విధానములు వినే వారినిబట్టి చెప్పవలసి వచ్చినది. మహాభూతములకు, ఖగోళగ్రహములకు జ్ఞానము తెలియుటకు ఆకాశ శబ్దము ద్వారా చెప్పవలసి వచ్చినది. ప్రవక్తలకు నేరుగా కాకుండా తెరచాటునుండి చెప్పవలసి వచ్చినది. అలాగే మనుషులకు మాత్రము ప్రత్యక్షముగా యుండు తన ప్రతినిధిని పంపి అతని ద్వారా చెప్పించ వలసి వచ్చినది. ఇట్లు మూడు విధములని అంతిమ దైవగ్రంథములో చెప్పియున్నారు. ఒకటి గ్రహములకు, మహాభూతములకు కాగా, రెండవ రకము ప్రవక్తలకు మాత్రమేకాగా, మనుషులకు మాత్రము మూడవ రకముగా చెప్పునని తెలియుచున్నది. ఎట్లు చెప్పినా మనుషులకు దేవుని ప్రతినిధితో జ్ఞానము చెప్పబడును.

**ప్రశ్న :- మనుషులకు తెలియజేయు జ్ఞానము 'కనిపించే దైవప్రతినిధి చేత' అని అన్నారు కదా! కనిపించే ప్రతినిధి మనిషి ఆకారములోనే యుండును కదా! మనిషిగాయున్నవాడు చెప్పితే మనుషులకు తెలియును. అంతేకదా!**

**జవాబు :-** అవును! మనిషి ఆకారములోయున్న వ్యక్తి చెప్పినప్పుడే మనుషులు వినగలుగుదురు. కనిపించే ప్రతినిధి మనిషేయని తెలియు చున్నది. 'నా జ్ఞానము నాకు తప్ప ఏ మానవునికీ తెలియదని' దేవుడే ఒకచోట అంతిమ దైవగ్రంథములోనే మూడవ సూరా, ఏడవ ఆయత్ (3-7) లో చెప్పినట్లు కలదు. అలాంటప్పుడు మనిషిగాయున్నవాడు దైవజ్ఞానమును మనుషులకు ఎలా చెప్పును? అని అనుమానము రాగలదు. అయితే దేవుడు తన ప్రతినిధిని పంపును అన్నప్పుడు అతనిని 'దేవదూత' అని

చెప్పుచున్నారు. దేవదూత అవసరమునుబట్టి భూమిమీదికి వచ్చి తాను చెప్పవలసిన జ్ఞానము చెప్పి తిరిగి ఆకాశములోనికి పోవుననో, లేక కనిపించకుండా పోవుననో చెప్పుచుందురు. అయితే అలా వచ్చి చెప్పి పోవువారు ఎవరూ లేరు. దేవదూతలు వచ్చి మాట్లాడి పోయిన ప్రత్యక్ష అనుభవములు ఎక్కడా లేవు. అట్లు జరిగిందని గ్రంథములలో వ్రాయగా విన్నాముగానీ, ప్రత్యక్ష ప్రమాణము ఎక్కడా లేదు. ప్రథమ దైవ గ్రంథములో ఎక్కడగానీ దేవదూతల ప్రసక్తే లేదు. ద్వితీయ దైవగ్రంథము, అంతిమ దైవ గ్రంథములలో దేవదూతల ప్రసక్తి వచ్చినది. అయితే అక్కడ కూడా దేవదూతలు అని చెప్పబడినది గానీ, 'దైవదూతలు' అని చెప్పలేదు. అయితే ఇక్కడ **మనుషులకు జ్ఞానము చెప్పినది దేవుని ప్రతినిధి లేక దైవ ప్రతినిధి** అని చెప్పవచ్చును. దేవుని ప్రతినిధి అంటే దేవుని యొక్క జిరాక్స్ కాపీలాంటి వాడని అర్థము. అంటే దేవునితో సమానముగా కనిపించువాడని అర్థము. ఈ విషయములో చాలామంది మనుషులు లేక మతముల వారు తికమక పడి సరియైన అవగాహన లేకుండా పోయారు.

**"దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు"** అని చెప్పినప్పుడు, **"దైవ ప్రతినిధి భూమిమీద మనుషులకు జ్ఞానము చెప్పునని"** తెలిసినప్పుడు ఆ దైవ ప్రతినిధికి దేవుని జ్ఞానము ఎలా తెలుసు? దైవ జ్ఞానమును చెప్పుచున్నాడు అంటే అతను ఎవడయినా దేవుడే కావచ్చును కదా! **"దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు అను సూత్రము ప్రకారము దైవజ్ఞానమును చెప్పువాడు ఎవడైనా దేవుడే యగునని చెప్పవచ్చును.** అంతేకాక దేవుడు తాను అవతరించుదునని మూడు గ్రంథములలో చెప్పియున్నా, దేవుని మాటను తప్పుగా వర్ణించి చెప్పు మనుషులను చూచి దేవునికి కోపము రాక తప్పదు. **దైవజ్ఞానమునకు**

**వ్యతిరేఖముగా చెప్పు వారికి క్షమించరాని పాపమును అంటుకొనునట్లు దేవుడు చేయును.** దేవుని జ్ఞాన విషయములో తప్పుడు నిర్ణయమును తీసుకొను వారికి, తన జ్ఞానమును సరియైన పద్ధతిలో అర్థము కాకుండా దేవుడే చేయగలడు. అటువంటి వారికి దైవజ్ఞానములో ఏ వాక్యము కూడా సరిగా అర్థము కాకుండా వేరుగా అర్థము కాగలదు. అప్పుడు వానికి దైవజ్ఞానము తెలియు అవకాశమే లేకుండా పోవును.

దేవుడు తన జ్ఞానమును మాటలతో చెప్పినప్పటికీ, అదే జ్ఞానమునే గ్రంథరూపములో తయారు చేయించి ఇచ్చాడు. అదియే వ్యాసునిచే వ్రాయించినది **"భగవద్గీత".** ఆ భగవద్గీతనే **'ప్రథమ దైవగ్రంథము'** అని అంటున్నాము. మొదట సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునే తిరిగి దేవుడు చెప్పినట్లు గ్రంథరూపమైన భగవద్గీతలోని జ్ఞానమే మిగతా మధ్యమ, అంతిమ దైవగ్రంథములలో కూడా వ్రాయబడినది. ఒకే దైవజ్ఞానము మూడు గ్రంథములలో యున్నా, మనిషి దానిని ఏమాత్రము గ్రహించక మూడు గ్రంథములలోని జ్ఞానము వేరువేరు దైవములదని చెప్పినప్పుడు, ఇది దేవుని రాకను ప్రోత్సహించినట్లు కాదా! మనుషులలోని ఈ లోపమును దేవుడే తన జ్ఞానముతో తొలగించాలి. అందువలన **"ఇది దేవుని రాకకు సమయము కాదా!"** అను ఆలోచన వస్తున్నది.

**ప్రశ్న :- దేవుడు రాడని అందరూ అనుచుండగా! మీరు అదే విషయము మీద దేవునిరాకకు ఇది సమయము కాదా? అని అంటున్నారు.**

**జవాబు :-** ధర్మములు అధర్మములుగా మారినప్పుడు నేను వస్తానని దేవుడు చెప్పాడు. ధర్మములు తెలియకుండా పోయి అధర్మములే ఎక్కువగా ఆచరణలో యున్నప్పుడు, అధర్మములతో అనుబంధమైన అజ్ఞానము ఎన్నో

విధములుగా ఉండును. వాటిలో 'దేవుడు రాడు' అనునది కూడా ఒక అజ్ఞానమే అగును. దేవుడు రాడు అనే క్రైస్థవులు, ముస్లీమ్‌లు ఉంటే, "దేవుడు వస్తే, వాడు నాకు కనిపిస్తే అప్పుడు వాని కథ చెప్తుతా'' అని కోపమును ప్రదర్శించే హిందువులు గలరు. 'దేవుడే స్వయముగా తనకు అన్యాయము చేశాడని, కనపడితే అప్పుడు నిలబెట్టి అడుగుతాననే' వాళ్ళు గలరు. దేవుని మీద అనేక రకముల నిందారోపణలు చేయు హిందువులు చాలామంది గలరు. 'తమకు భయపడి దేవుడు దాచి పెట్టుకొన్నాడనే' వారు గలరు. ఎవరు ఎట్లు మాట్లాడినా దేవుడు ఎవరినీ ప్రశ్నించడు, కావున తాము దేవునికంటే పెద్దగా మాట్లాడుతాము అను వారూ గలరు. మొత్తము మీద దేవుడు రాడనే భావమునే మనుషులు కల్గియున్నారు.

దేవుడు భూమిమీదికి మనుషుల మధ్యలోనికి వచ్చి తన ధర్మములను పూర్తి వివరముగా జ్ఞానరూపములో చెప్పిపోవునని మేము చెప్పితే, మమ్ములను అజ్ఞానులలో మొదటివారుగా లెక్కించిన వారు గలరు. అయితే నేను చెప్పినది వాస్తవమేనని వారికి ఏమాత్రము తెలియదు. కావున వారు విన్నదే సత్యమని ఆయా మత ప్రజలు అనుకోగా, వారు చదివినప్పుడు అర్థమయినదే సత్యమని ఆయా మతబోధకులు అనుకోవడమైనది. అలా అనుకోవడము వలన ఎదుటివాడు సత్యమును చెప్పినా అది వారికి అసత్యములాగానే కనిపించును. ఇప్పుడు ఒక విషయమును తీసుకొని చూస్తాము. నా దగ్గర వజ్రమున్నది. నా దగ్గరవున్న వజ్రములాంటిది ప్రపంచములో ఎక్కడా లేదనుకొనుము. 'నేను చూపిస్తే తప్ప ఎవరూ దానిని చూడలేరు' అని నేను చెప్పాననుకోండి అది వాస్తవమే కదా! నావద్ద తప్ప ఎవరివద్దా లేని వజ్రమును ఎవడు చూచినా నావద్దనే చూడాలి.

నావద్ద కాకుండా ఇతరుల దగ్గర చూచుటకు వీలులేదు. ఎప్పుడు చూచినా, ఎక్కడ చూచినా వజ్రమును నావద్దే చూడాలి తప్ప అన్యదా వేరే దారే లేదు. దేశములో ఇంకొకరి వద్ద ఇంకొక వజ్రమంటూ లేనప్పుడు, ఉన్న వజ్రము నావద్ద మాత్రమే యున్నప్పుడు నాకు తెలియకుండా, నేను చూపకుండా ఎవడూ చూచుటకు వీలులేదు. అయితే ఆరునెలల క్రిందట నేనున్న చోటికి మూడు వందల కిలోమీటర్ల దూరములో, ఒక మారుమూల పల్లెటూరిలో, ఆ ఊరులోనివారు పదిమంది ఒకేమారు వజ్రమును చూచినట్లు చెప్పారు. ఒక బిక్షగాని దగ్గర వజ్రమున్నట్లు, అతడు తనవద్దయున్న వజ్రమును చూపించగా పదిమంది ఆ వజ్రమును చూచినట్లు చెప్పుట వలన 'నావద్ద తప్ప వజ్రము ఇతరుల వద్ద లేదు' అను మాటను కొందరు అసత్యము అని అనుకొన్నారు. అట్లని నేను అసత్యమును చెప్పువాడను కాను. నేను చెప్పునదంతా సత్యమే.

అయితే వారు చెప్పునది ఒకవేళ అసత్యమయితే కావచ్చునుగానీ నేను చెప్పునది మాత్రము నూటికి నూరుశాతము సత్యము. ఇంకొక చోట వజ్రమును చూచామని చెప్పుచున్న పదిమంది అసత్యము చెప్పు వారా! లేక సత్యము చెప్పువారా! అని చూస్తే, ఎటు విచారించినా వారు సత్యము చెప్పువారేయని అందరూ చెప్పుచున్నారు. పైగా మేము చూచినది సత్యము అని పదిమంది ముక్తకంఠముతో చెప్పుచున్నారు. అంతేకాక వారు చూచిన వజ్రము యొక్క ఆకారము, బరువు, దానిలోని వెలుగు అన్నీ సక్రమముగా చెప్పుచున్నారు. వారు చెప్పే వజ్రము యొక్క పోలిక చూస్తే నావద్ద గల వజ్రము పోలికగానే యున్నదని చెప్పుచున్నారు. నేను 'మీరు వజ్రము చూడలేదు' అని చెప్పినా, వారు నా మాటను వినకుండా 'నీ మాట అబద్ధము' అని వారు నన్ననగా! 'కాదు మీ మాటయే అబద్ధమని'

నేను అనడము జరిగినది. ఇట్లు నేను ఒక్కనిని ఒకవైపు, ఆ పదిమంది మరొక వైపు వాదించడము చాలామంది చూచారు. అయినా ఎవరి మాట సత్యము, ఎవరి మాట అసత్యము అని ఎటూ తేల్చి చెప్పలేకపోయారు. ఈ సమస్య ఇట్లుండగనే ఒక చదువురాని చాకలివాడు మా ఊరిలోనికి రావడము జరిగినది. ధనికుడయిన నా మాటను, ఇతర గ్రామస్థులయిన పదిమంది మాటను అందరూ విన్నట్లు విన్నాడు. అయితే ఆ చదువురాని చాకలికి ఇదేమీ పెద్ద సమస్యవలె కనిపించలేదు. ఇంత చిన్న విషయానికి ఇంతమంది తలలు గోకుకోవడము ఎందుకు? దీని అసలు నిజమును నేను సులభముగా చెప్పెదను వింటారా! అని అన్నాడు. అప్పుడు అందరూ ఆశ్చర్యముగా ఆ చాకలివైపు చూస్తూ, మేము చదువుకొన్నవారము మాకులేని తెలివి నీకున్నదా! దీనిని గురించి ఏమని చెప్పగలవు? చెప్పు చూస్తాము అన్నారు. వారి మాటలు క్రింది విధముగా సాగినవి.

**చాకలి :-** పదిమంది చెప్పేమాటను నమ్ముతారా! ఒక్కడు చెప్పేమాటను నమ్ముతారా?

**ఊరివారు :-** పదిమంది ఒకే మాట చెప్పుచున్నారు కావున ఒక్కని మాటకంటే పదిమంది చెప్పేమాటనే సత్యమని నమ్మవచ్చును. ఒక్కడు అబద్ధమైనా చెప్పవచ్చును లేక సత్యమైనా చెప్పవచ్చును.

**చాకలి :-** పదిమంది ఒక బిక్షగానివద్ద వజ్రమును చూచారు. వారు చూచినది వాస్తవమే. అయితే బిక్షగానివద్ద వజ్రముంటుందా?

**ఊరివారు :-** ధనికుని వద్ద ఉన్నదంటే నమ్మవచ్చును గానీ, బిక్షగానివద్ద వజ్రముందంటే నమ్మడానికి వీలులేదు.

**చాకలి :-** ఒక్కడు అసత్యమైనా చెప్పవచ్చును అనుటకు అవకాశమున్నట్లు, బిక్షగానివద్ద వజ్రము లేదనుటకు కూడా అవకాశము కలదు. అయితే

ఇక్కడ ఒక ప్రశ్న రాగలదు. అదేమనగా! బిక్షగాడు వజ్రమును పదిమందికి చూపాడు. ధనికుడు తనవద్ద వజ్రముందని చెప్పుచున్నాడు. కానీ ఎవరికీ చూపలేదు. నేను ఎవరికయినా నా వజ్రమును చూపగలనని బిక్షగాడు చెప్పడమే కాక పదిమందికి చూపాడు. ఇంకెవరికయినా చూపగల నంటున్నాడు. వజ్రముంది అని చెప్పుచూ 'నేను ఎవనికీ నా వజ్రమును చూపను' అనే ధనికుని మాటను నమ్మమంటారా? అయినా ధనికుడు చెప్పు మాటలో నిజమే వుందని తప్పక నమ్ముతాము. ఎందుకనగా! వజ్రము యొక్క విషయమును మొదట చెప్పినది ధనికుడే కనుక నమ్మి తీరాలి. నమ్మడమే కాక ఆ మాట సత్యమే అనుకొందాము. భూమిమీద ఉన్నది ఒకే వజ్రమయిన దానివలన, దానిని పోలిన వజ్రము ఇంకొకటి లేనిదానివలన ధనికుని దగ్గర వజ్రముంది యంటే అది నిజమే. పదిమంది బిక్షగానివద్ద చూచిన మాట నిజమే. వజ్రము ఒక్కటే యున్నప్పుడు బిక్షగాడు రెండవ వజ్రమును ఎలా చూపగలడు? రెండవ వజ్రము లేదనుట నూటికి నూరుపాళ్ళు సత్యము. అట్లే ధనికుని వద్దనే వజ్రమున్నదనుట వాస్తవమే అయితే మరొక వ్యక్తి వద్ద పదిమంది వజ్రమును ఎలా చూడగలరు? పదిమంది సత్యమునే చెప్పుచున్నారని తప్పనిసరిగా మనము ఒప్పు కోవలసిందే. నావద్ద తప్ప ఎవరివద్ద వజ్రము లేదని తేల్చి చెప్పినప్పుడు మూడు వందల కిలోమీటర్ల దూరములో వజ్రమున్నదంటే, అక్కడ పదిమంది వజ్రమును చూచారు అంటే, వజ్రమున్నచోట ధనికుడయినా ఉండాలి లేక ధనికుడున్నచోట వజ్రమయినా ఉండాలి. ఇప్పుడు బాగా ఆలోచిస్తే ధనికుడున్నచోట వజ్రముండుట ఎంత సత్యమో, వజ్రమున్నచోట ధనికుడున్నాడనుట కూడా అంతే సత్యమగును.

**ఊరివారు :–** ధనికుడున్నచోట వజ్రమున్నది గానీ, వజ్రమున్నచోట ధనికుడు లేడు కదా! అక్కడ బిక్షగాడున్నాడు కదా!

**చాకలి :-** ధనికుడే సుదూర ప్రాంతమయిన మూడు వందల కిలమీటర్ల దూరముపోయి బిక్షగానిగా నటించి పదిమందికి తన వజ్రమును చూపియుండవచ్చును కదా!

**ఊరివారు :-** ధనికుడు 'తన వజ్రమును ఏ మనుషులకు చూపను' అని శపథము చేసినట్లు చెప్పాడు కదా! అలాంటప్పుడు తన వజ్రమును పదిమందికి చూపడనియేగా అర్థము.

**చాకలి :-** 'నేను ఎవరికీ వజ్రమును చూపను' అని చెప్పినది ధనికుడు, ఆ మాట నిజమే. అయితే ఇక్కడ వజ్రమును పదిమందికి చూపినది ధనికుడు కాదు కదా! బిక్షగాడు కదా! ఆయన ధనికునిగా చూపనని చెప్పాడు గానీ బిక్షగానిగా చూపనని చెప్పలేదు కదా! అందువలన చెప్పినమాటను తప్పకుండా ధనికునిగా వజ్రమును చూపలేదు. కేవలము ఒక బిక్షగానిగా యున్నప్పుడు మాత్రము తన వజ్రమును చూపాడు.

**ఊరివాడు :-** అలా బిక్షగానిగాయుంటూ అప్పుడు ఎందుకు తన వజ్రమును చూపాడు?

**చాకలి :-** తన వజ్రము ఎటువంటిదో ఇతరులకు తెలియుటకు, ముందుచెప్పిన తనమాటను మీరకుండా, ధనికుడుగా యున్నప్పుడు కాకుండా బిక్షగానిగా యున్నప్పుడే చూపాడు. అలా చూపుట వలన వజ్రమంటే ఏమిటి? అని ఇతరులకు తెలిసింది. వజ్రము గొప్ప ప్రకాశవంతముగా యుండునని తెలియుట వలన, వజ్రకాంతి చూస్తే కొన్ని కంటి రోగములు పోవునని తెలియుట వలన అందరూ వజ్రమును చూడాలని అనుకుంటారు. అలా వజ్రమును ఎవరూ చూడకపోతే, దాని విలువ ఏమాత్రము ఇతరులకు తెలియకపోతే, ధనికునివద్ద వజ్రముందనినా అది విలువ లేనిదిగానే యుండును. ఏమాత్రము విలువ తెలియనిది ఏదయినా ఉన్నా ఒక్కటే,

లేకున్నా ఒక్కటే! ఎవనికయినా డబ్బు విలువ తెలియుట వలన ఎవడయినా కోటీశ్వరుడున్నాడంటే అతనిని గొప్పవాడుగా (గొప్ప ధనికుడుగా) అనుకొంటాము. డబ్బు అంటే ఏమిటో తెలియనప్పుడు కోటీశ్వరుడు మన ప్రక్కలో యున్నా వానిని గొప్పగా చూడము. అలాగే వజ్రము విలువ తెలియకపోతే వజ్రము తన దగ్గరున్నా తనకేమీ విలువ యుండదని, వజ్రమును గురించి ఇతరులకు తెలియునట్లు బిక్షగాని వేషములో ధనికుడే తన వజ్రమును పదిమందికి చూపాడు. అయితే ఈ ధనికుడే ఆ బిక్షగాడు, లేక ఆ బిక్షగాడే ఈ ధనికుడని ఎవరూ ఊహించలేకపోయారు. పదిమంది వజ్రమును చూచియుండుట వలన, వజ్రము యొక్క విలువ అందరికీ తెలిసిపోవుట వలన, నిజముగా వజ్రమున్న ధనికున్ని అందరూ గొప్పగా చెప్పుకొని గౌరవింతురు. తన వజ్రము విలువ తెలియకపోతే తన గొప్ప తనము ప్రజలకు తెలియదనీ, ధనికుడే బిక్షగానివలె వజ్రమును ఇతరులకు చూపాడు అని తేల్చి చెప్పుచున్నాను.

**ప్రశ్న :- ధనికుడు తన వజ్రమును మరొకనిగా (బిక్షగానిగా), మరొక ఊరిలో ప్రజలకు చూపుట వలన ప్రజలు వజ్రమును గురించి చెప్పుకొను నప్పుడు ధనికుడే జ్ఞాపకము వస్తాడని మీరు చెప్పుచున్నారు కదా! అట్లెందుకు అనుకోవాలి? బిక్షగాని దగ్గరే వజ్రముందని, బిక్షగానిని జ్ఞాపకము చేసుకోవచ్చును కదా!**

**జవాబు :-** బిక్షగాడు కొద్ది రోజులు మాత్రము కనిపించి వజ్రమును చూపిపోయాడు. తర్వాత బిక్షగాడు లోకములోనే లేడు ఎక్కడికో పోయాడని తెలిసింది. కనిపించేవాడు మాత్రము ధనికుడే. అయితే బిక్షగానివద్ద వజ్రమును చూచినందుకు, వజ్రమును గురించిన ఆలోచన వచ్చినప్పుడు కొందరికి బిక్షగాడు జ్ఞాపకము వచ్చాడు, కొందరికి ధనికుడు జ్ఞాపకము

వచ్చాడు. ప్రత్యక్షముగా చూచినవారు వజ్రమును గురించి చెప్పగా, చూడని వారు వజ్రము ధనికుని దగ్గరున్నదని ధనికున్ని జ్ఞప్తి చేసుకొనెడివారు. ఇట్లు వజ్రము విషయములో ఒకవైపు కొందరికి బిక్షగాడు జ్ఞాపకము రాగా, మరొక వైపు మరికొందరికి ధనికుడు జ్ఞాపకము రావడము జరుగుచుండెను. వజ్రము ఒక్కటే అయినా దాని విషయములో బిక్షగాడు, ధనికుడు ఇరువురు జ్ఞప్తికి రావడము జరిగెడిది. అయితే కొంత కాలము జరుగగా చాలామంది వజ్రమును మరచిపోయారు. వజ్రమును మరచి పోవడము వలన ఇటు ధనికుడుగానీ, అటు బిక్షగాడుగానీ ఎవరూ జ్ఞప్తికి రావడము లేదు. అటువంటి సమయములో బిక్షగాడు కనిపించి తన దగ్గరున్న వజ్రమును వేయిమందికి చూపడమైనది. అంతేకాక ఫలానా ధనికుని వద్దయున్న వజ్రమే ఇది యని చెప్పడము కూడా జరిగినది. అలా చూపబడిన వజ్రము వలన ఈమారు ధనికున్ని, బిక్షగానిని ఇద్దరినీ అందరూ జ్ఞాపకము చేసుకోవడము జరిగెడిది. అంతేకాక ధనికుని దగ్గర గల వజ్రమేనంటయని కూడా చెప్పుకోవడమైనది.

**ప్రశ్న :- "ఇనుమున చేసిన మైనపుకడ్డీ, ముంటిమొన నర్రావుల దొడ్డి, కూర్చుండి మేపిన కుందనపు గడ్డి, విప్పి చెప్పురా వేమారెడ్డి" అని మనస్సును గురించి వేమన యోగి ఒక పద్యమును చెప్పినట్లు మనస్సు ఒక విషయము మీద ఉండక అనేక విషయముల మీదికి పోవుచుండును. ఇప్పుడు అదే విధముగా మనము "దేవుని రాకకు ఇది సమయము కాదా?" యని మొదలు పెట్టి. దేవుడు వస్తాడు, రాడుయని అనుకొనుచూ చివరికి ఎక్కడికో పోయి ధనికుడు, బిక్షగాడు, వజ్రము అని దానిలో పడిపోయాము. మనము మొదలు పెట్టింది ఎక్కడ, మాట్లాడేది ఎక్కడ? ఇంతకూ ఇంతవరకు మనము మాట్లాడిన విషయమునకు, మొదలు పెట్టిన విషయమునకు ఏమయినా సంబంధమున్నదా? కొంతయినా పోలికయున్నదా?**

**జవాబు :-** మనము దేవుడు భూమిమీదికి వచ్చి పుట్టునా? లేదాయను విషయమును మొదలుపెట్టాము. అయితే దానికి అనుబంధముగానే 'ధనికుడు, వజ్రము' కథను చెప్పుకొన్నాము. మనము మొదలు పెట్టిన విషయమునకు 'ధనికుడు, వజ్రము' అను విషయమునకు చాలా పోలికలున్నాయి. ఇంతవరకు చెప్పుకొన్న జ్ఞానమార్గము యొక్క పోలిక ఏ విధముగాయున్నదో ఇప్పుడు చూస్తాము. **'దేవుడు ఎవరికీ కనిపించడు, ఎవరితోనూ ప్రత్యక్షముగా మాట్లాడడు. తన జ్ఞానమును నేరుగా ఎవరితోనూ చెప్పడు'** అను విషయమును అంతిమ దైవగ్రంథములో **42వ సూరా, 51వ** ఆయత్‌నందు చెప్పబడినది. అంతేకాక **"దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మానవునికి తెలియదని, ఇతరులెవ్వరికీ తెలియదని"** అదే అంతిమ దైవగ్రంథములో **3వ సూరా, 7వ** ఆయత్‌నందు చెప్పబడినది. ఇప్పుడు అదే విషయమునే పైన చెప్పిన ధనికుడు, వజ్రము కథలో చెప్పుకొన్నాము. ఆ కథకు దైవగ్రంథములో వాక్యములకు పూర్తి పోలిక యున్నదని చెప్పవచ్చును.

సృష్టికర్త అయిన దేవుడు ఈ కథలో ధనికుడుగా చెప్పబడినాడు. దేవుని జ్ఞానమును వజ్రముగా చెప్పడమైనది. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులెవరికీ తెలియదని చెప్పినట్లు ధనికుని వద్దయున్న వజ్రము ధనికునికి తప్ప ఎవరికీ తెలియదు. దేవుని దగ్గర గల జ్ఞానము ఎవరికీ తెలియనట్లు ధనికుని దగ్గరయున్న వజ్రమును ఎవరికీ తెలియదని సమాన పోలికతో చెప్పడమైనది. దేవునివద్ద గల జ్ఞానమును దేవుని ప్రతినిధి ద్వారా భూమిమీద మనుషులకు దేవుడు చేరవేసినట్లు, ధనికుడుగాయున్న వాడే తన వజ్రమును తాను పంపిన బిక్షగానిచేత చూపించాడు. అయినా తాను ఎవరిని పంపినది బయటికి చెప్పకపోవడము వలన బిక్షగాడు

ఎవరయినది? అతని దగ్గర వజ్రమెలా యున్నది? మనకు తెలియకుండా పోయినది. దేవుని ప్రతినిధియైన భగవంతుడు తెలిపిన జ్ఞానమును తెలియ గలిగి దేవున్ని గౌరవించినట్లు, బిక్షగాడు చూపిన వజ్రమును చూచి ధనికున్ని గౌరవించడము జరిగినదని చెప్పుకొన్నాము. కాలక్రమేపీ ధర్మములు అధర్మములుగా మారిపోయి భగవంతున్ని గురించిగానీ, దేవున్ని గురించిగానీ తెలియకుండా పోయినట్లు కొంత కాలమునకు వజ్రమును, బిక్షగాడిని, ధనికున్ని మరచిపోయారని చెప్పుకొన్నాము.

అటువంటి సమయములో దేవుడు తిరిగి భగవంతునిగా వచ్చి ముందు చెప్పిన జ్ఞానముకంటే కొంత ఎక్కువగా చెప్పిపోవును. కనుక బిక్షగాడు తిరిగి వచ్చి వజ్రము చూపునని, ముందు వచ్చినప్పుడు పదిమందికి మాత్రము చూపియుంటే, ఈ మారు వేయిమందికి వజ్రమును చూపునని చెప్పినట్లు, దేవుడు రెండవ రాకలో వచ్చినప్పుడు ముందు చెప్పిన జ్ఞానము కంటే ఎక్కువ బోధించునని, ఈ జ్ఞానమంతా దేవుని జ్ఞానమేనని చాటి చెప్పునని చెప్పుచున్నాము. అలాగే బిక్షగానిగా వచ్చినవాడు ఎక్కువ మందికి వజ్రమును చూపించడమేకాక ఈ వజ్రము ధనికునిదేయని చాటి చెప్పును. దేవుడు దేవునిగా కాకుండా భగవంతుడను మనిషిగా వచ్చి జ్ఞానమును భూమిమీద చెప్పిపోవునను దానికి సమాన పోలికగా 'ధనికుడు, బిక్షగాడు' కథను చెప్పడమైనది.

**ధనికుడు – దేవుడు**

**బిక్షగాడు – భగవంతుడు**

**వజ్రము – దైవజ్ఞానము**

**300 కిలోమీటర్ల దూర ప్రాంతము – భూమిమీద అజ్ఞానమున్న చోటు**

| | | |
|---|---|---|
| వజ్రమును చూచిన మనుషులు | – | జ్ఞానమును వినిన మనుషులు |
| వజ్రమును మరచి పోవుట | – | ధర్మములు అధర్మములుగా మారుట |
| రెండవమారు బిక్షగాడు వచ్చుట | – | దేవుడు భగవంతునిగా రెండవమారు వచ్చుట |

ప్రశ్న :– నేడు హిందువులలో 'ఈశ్వర లింగము'లను పెట్టి శ్రద్ధగా పూజించు వారున్నారు. అలాగే క్రొత్తక్రొత్త 'చర్చీలను' క్రైస్థవులు నిర్మించుచూ, బైబిలు బోధలను చెప్పుచూ ప్రార్థనలు చేయుచున్నారు. ముస్లీమ్‌లు మజీద్‌లను ప్రార్థనా మందిరములను కట్టించుకొని నమాజ్‌లు చేయుచున్నారు. ఎవరి మతములో వారు చాలా శ్రద్ధగా దేవుని మీద భక్తికల్గి ముందుకు పోవు చున్నారు. పూర్వముకంటే ఇప్పుడే దేవుని మీద ఎక్కువ నమ్మకము కల్గి పూర్తి విశ్వాసముతో అందరూ కాకున్నా కొందరయినా చాలా నిష్టగా యున్నారు. హిందువులలో ఎంతోమంది స్వామీజీలు, ఎంతో కఠోరమైన నిష్టలను ఆచరించి మిగతా వారికి భక్తిని చాటుచున్నారు. ఇకపోతే క్రైస్థవులలో ఫాదర్‌లు, పాస్టర్లు తమ గ్రంథములోని వాక్యములను పఠించుచూ మిగతా వారిని కూడా ఏసునందు విశ్వాసము కల్గునట్లు చేయుచున్నారు. వారి బోధలను అనుసరించి చాలామంది హిందువులు క్రైస్థవులుగా మారి పోయారు. మిగిలిన ముస్లీమ్‌లను గురించి చెప్పితే ముందు పుట్టిన హిందూ, క్రైస్థవులకంటే దేవునిమీద విశ్వాసము ఎక్కువగా కల్గియున్నారు. హిందువులు పండుగ దినములలో 'గుడులకు' పోయి దేవుళ్ళను పూజించితే, క్రైస్థవులు వారమునకు ఒకమారు అదియూ సెలవు దినమైన 'ఆదివారము' మాత్రము చర్చీలకు పోయి ప్రార్థన చేసి రావడము చేయుచున్నారు.

**ముస్లీమ్‌ల విషయానికి వచ్చి చూస్తే వారు ప్రతి దినము 'మజీద్'కు పోయి 'నమాజ్' అను దైవప్రార్థన చేయడమును చూస్తూనే యున్నాము. ప్రతి దినము ఒకమారు ప్రార్థన చేయువారు కొందరుండగా, ప్రతి దినము ఐదు పూటల నమాజ్ చేయువారు మరికొందరు గలరు. ఆడవారు నమాజ్ సమయమునకు ఇంటిలోనే ప్రార్థన చేయుచున్నారు. ఈ విధముగా హిందువులకంటే క్రైస్థవులు, క్రైస్థవులకంటే ముస్లీమ్‌లు దేవుని ఆరాధనలో ముందున్నారు. ఇట్లు నేడు పూర్వముకంటే భక్తి ఎక్కువగా యున్నట్లు తెలియుచుండగా, ఇప్పుడు మీరు వచ్చి "దేవుని రాకకు ఇది సమయము కాదా!" అని అంటే మీ మాట హాస్యాస్పదముగా ఉన్నది. ఒక మతముతో మరియొక మతము పోటీపడి భక్తిమార్గములో ముందుకు పోవు సమయములో మీరు ఈ మాటను చెప్పడము సమంజసమేనా?యని ప్రశ్నించుచున్నాము.**

**జవాబు :-** కృష్ణుడు 'భగవద్గీత'ను చెప్పినప్పుడు **'నేడు చెలరేగిన అధర్మములను రూపుమాపి, తిరిగి ధర్మములను ప్రతిష్ఠించుటకు వచ్చానని"** చెప్పడము జరిగినది. అయితే ఆనాడు ఎవరయినా ఆ మాట నిజమని అనుకొన్నారా? లేదు. ఆ రోజులలో వ్యాసుడు వ్రాసిన వేదములు, పురాణములు, ఉపనిషత్తులు ప్రజలలో పూర్తిగా వ్యాపించిన దానివలన ఆనాడు ప్రజలు వేదములను ఎక్కువగా చదివెడివారు, యజ్ఞములను విరివిగా చేసెడివారు. దానములను చేయడము గొప్పగా తలచెడివారు. ఇంకా భక్తి ఎక్కువయిన వారు ముక్కు మూసుకొని, గోసి పెట్టుకొని తపస్సులు చేసెడివారు. ప్రజలు అన్నిటిలో పాల్గొనెడివారు. ఆ దినములు అత్యంత భక్తి ప్రవృత్తులున్న రోజులుగా అందరూ తలచెడివారు. సన్న్యాసత్వము స్వీకరించి, కాషాయ గుడ్డలు ధరించినవారు ఎక్కువగా యుండెడివారు.

అటువంటి రోజులలో శ్రీకృష్ణుడు వచ్చి నేడు ధర్మములన్నియూ మంటగలసి పోయినవనీ, 'ధర్మసంస్థాపన' చేస్తానని చెప్పడము కొందరికి ఆశ్చర్యముగనే కనిపించినది. మంచివారిని పెంపొందించి దుష్టుల సంఖ్యను తగ్గిస్తానని **"పరిత్రాణాయసాధూనాం వినాశాయచ దుష్కృతామ్"** అన్న మాటకు అప్పుడు దుష్టులు ఎవరని ఆలోచించారు. అంతా మంచివారుగా భక్తివరులుగా కనిపించు ఆ రోజులలో దుష్టులుగా ఎవరూ కనిపించలేదు. అయితే ఎవరిని ఉద్దేశించి కృష్ణుడు ఆ మాటలను చెప్పాడో చాలామందికి అర్థము కాలేదు. అయితే ఆయన చెప్పిన భగవద్గీతా జ్ఞానము ఏ దుష్టులను మార్చినదో కృష్ణుడు పోయిన తర్వాత కూడా అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ఇప్పుడు మనము **"దుష్టత్వము"** అంటే ఏమిటో అర్థము చేసుకోగలిగితే, సన్మార్గము అంటే ఏమిటో సులభముగా అర్థము కాగలదు.

దేవుడు భగవంతునిగా నర శరీరమును ధరించి వచ్చి ఆయన తన జ్ఞానముతోనే దుష్టులను మార్చగలనని తెలుపుచూ **"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"** అని అన్నాడు. దీనితో ధర్మసంస్థాపన చేసి దుష్టులను లేకుండా చేయుదునని చెప్పినట్లయినది. ధర్మసంస్థాపనయనగా దైవజ్ఞానమును తెలియచేయడమేనని అర్థము. దైవజ్ఞానమును తెలియ చేయడము భగవంతుని మొదటి పనికాగా, దుష్టులను తగ్గించడము రెండవ పనిగా తెలియుచున్నది. కృష్ణభగవాన్ ఆ రోజులలో తాను భగవంతుడనని ఎవరికీ తెలియకుండావుండి, తన వయస్సు 90 సంవత్సరములు గడచిన తర్వాత యుద్ధసమయములో ఎవరూ వినకుండా, ఒక్క అర్జునునితోనే తన జ్ఞానమును మాటల రూపముగా ఐదారు నిమిషములలో తెలియజేశాడు. అలా ఒక్కనికే ఎవరికీ తెలియకుండా అర్జునునకు మాత్రము చెప్పితే అర్జునునకు అది పూర్తిగా అర్థముకాక

తప్పక వ్యాసుని వద్దకు పోయి తాను చెప్పినదంతా వ్యాసునికి చెప్పునను ఉద్దేశ్యముతోనే, ముందు అంచనాతోనే ఒక పథకము ప్రకారము కృష్ణుడు అర్జునునకు జ్ఞానమును చెప్పాడు. అర్జునునకు అప్పటికి కొద్దిగా అర్థమయినా, తర్వాత అంతా సంశయాలమయమైపోయినది. అర్జునుని మనస్సు లేనిపోని ప్రశ్నలను జ్ఞాపకము తెచ్చినది. అప్పుడు అర్జునుడు ఆ కాలములో జ్ఞానము అంతా తెలిసినవాడనిపించుకొన్న వ్యాసుని వద్దకు పోయాడు. నాల్గు వేదములను, పదునెనిమిది పురాణములను వ్రాసిన వ్యాసుడు దేనికయినా సమాధానము ఇవ్వగలడను ఉద్దేశ్యముతో అర్జునుడు వ్యాసునివద్దకు పోయాడు. ఆ విధముగా కృష్ణుని పథకము నెరవేరినది.

కృష్ణుని పథకము ప్రకారమే అర్జునుడు వ్యాసునివద్దకు పోయి కృష్ణుడు చెప్పిన జ్ఞానమునంతటినీ రవ్వంత కూడా వదలకుండా చెప్పాడు. చివరకు ఇదియంతయూ వాస్తవమేనా? అను సంశయమును వెలిబుచ్చాడు. అంతవరకు కృష్ణుడు ముందుగా అనుకొన్నది అనుకొన్నట్లు జరిగినది. అయితే ఇక్కడ మనకు కలిగే ప్రశ్న ఏమిటంటే కృష్ణుడు అంత పథకముగా ఎందుకు అర్జునున్ని వ్యాసునివద్దకు పంపాడు. కృష్ణునికి అర్జునున్ని వ్యాసుని వద్దకు పంపడములో దాగియున్న ఉద్దేశ్యమేమిటి? అన్నదే ప్రశ్న. ఈ ప్రశ్నకు వాస్తవముగా ఆనాటి కృష్ణుడే సమాధానము చెప్పవలసియున్నది. అయితే ఆయన మనకు అందుబాటులో లేడు. మనకు అందుబాటులో యున్నది ఆయనలోని ఆత్మ మాత్రమే. ఆనాడు కృష్ణ శరీరములో జరిగిన పనులన్నిటినీ ఆత్మయే చేయించియుండును, కనుక కృష్ణుడు లేకపోయినా కృష్ణునిలో గల ఆత్మ మనలో కూడా యుండుట వలన, నాలో యున్నది కూడా అదే ఆత్మే అగుట వలన, అప్పటి కృష్ణుని భావములను నా ఆత్మ ద్వారా తెలుసుకోగలనని చెప్పుచున్నాను. అయితే ఈ నా మాటలో కూడా

కొందరికి సందిగ్ధత ఏర్పడును. అందరిలో యున్న ఆత్మ అంటాడు! అదే నా ఆత్మ అంటాడు! అందరిలోవున్న ఆత్మ మీలో కూడా ఉంది, మీకు జవాబును చెప్పగలిగితే అదేదో మాతో కూడా చెప్పవచ్చును కదా! మాతో చెప్పకుండా నీ ఒక్కనితో చెప్పడము వలన మేము మీకు ఆత్మే చెప్పినదని ఎలా నమ్మాలి? మీరే స్వయముగా కల్పించి చెప్పుచున్నారని మేము అనుకోవచ్చును కదా!యని అడుగవచ్చును. దానికి నా జవాబు ఇలా గలదు.

ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున చెప్పిన పదిహేనవ శ్లోకములో ఇలా కలదు. "మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనంచ" **"నా వలననే కలుగు స్మృతి, జ్ఞానము, ఊహ"** అని చెప్పడమైనది. దీనినిబట్టి నాలోనుండి వచ్చు జ్ఞాపకముగానీ, జ్ఞానముగానీ, ఊహలు గానీ అన్నీ ఆత్మయే కల్గించుచున్నదని తెలియుచున్నది. అటువంటప్పుడు నేను ప్రత్యేకముగా కల్పించి మాట్లాడునది ఏదీ లేదు. ఇదే విషయమునే ద్వితీయ దైవగ్రంథమయిన ఇంజీలు (బైబిలు) గ్రంథమందు మత్తయి సువార్త 10వ అధ్యాయములో 20వ వచనము ఇలా కలదు చూడండి. **(మ. 10-20) "మీ తండ్రి ఆత్మ మీలో ఉండి మాట్లాడుచున్నాడే గానీ మాటలాడువారు మీరు కాదు"** అని కలదు. "ప్రతి మాటను మీలోయున్న ఆత్మే మాట్లాడుచున్నది మీరు కాదు" అని అంత దృఢముగా దైవగ్రంథములో చెప్పగా తర్వాత కూడా నేను కల్పించి మాటాలాడుతానని మీరెలా అనుకొంటున్నారు? నేనే మాట్లాడుచున్నానని నేనెలా అనుకోవాలి? 'నేనుగానీ, మీరుగానీ ఏదీ మాట్లాడలేదు, ఏమీ మాట్లాడలేదు' అన్నదే వాస్తవము. ఇక్కడ నీ ప్రశ్నకు ఆత్మ జవాబు చెప్పితే, మాకు కూడా మా ప్రశ్నలకు ఆత్మ జవాబు చెప్పవలెను

కదా! మాకు ఏమాత్రము చెప్పని ఆత్మ నీకు ఒక్కనికే ఎలా చెప్పునని మేము అడుగుచున్నామని కొందరు అనవచ్చును. ఇది అడుగవలసిన ప్రశ్నే. అయితే వాటికి ముందే జవాబు భగవద్గీతలోనూ, బైబిలు గ్రంథములోనూ చెప్పబడినది. ఈ ప్రశ్నకు అంతిమ దైవగ్రంథములో కూడా ఇలా చెప్పబడినది చూడండి.

సూరా అల్‌బఖర 2, ఆయత్ 186లో ఇట్లు కలదు. **(2-186)** **" నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే నేను వారికి అతి సమీపములోనే ఉన్నాను. పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపును విని జవాబిస్తాను. కాబట్టి వారు సరైన మార్గము పొందటానికి నా ఆజ్ఞను అనుసరించాలి. ఇంకనూ నాయందు విశ్వాసము కలిగియుండాలి అని చెప్పు."** ఇక్కడ చెప్పిన వాక్యములో చాలా వివరముగా ఎవరు అడిగినా ఆయన జవాబు చెప్పునని కలదు. దేవుని భక్తులు దేవున్ని గురించి తెలుసుకోవాలని అడిగితే **"దేవుడు ఆత్మరూపములో అత్యంత సమీపముగా ఉన్నాడు"** అని చెప్ప వచ్చును. అంతేకాక "ఎవరు నన్ను పిలువగలిగినా వాని పిలుపును విని వానికి జవాబిస్తాను" అని అనుట వలన ఎవరి పిలుపునయినా అనగా! 'ఎవరు అడిగినా వారి అభ్యర్థనను ఆయన విని దానికి సరిపడు జవాబు ఇస్తానని' చెప్పుట వలన, నేను ఒక్కడినే కాదు మీరు కూడా ఆయనను అడుగవచ్చును. మీరు అడుగలేదు మీకు జవాబు చెప్పలేదు. నేను అడిగాను నాకు జవాబు చెప్పాడు. మేము అడిగాము మాకు చెప్పలేదే? యని కూడా కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! "వారు సరైన మార్గమును పొందడానికి నా జవాబును అనుసరించాలి" అని

వాక్యములో ఉండుట వలన ఎవరు అడిగినా  అడిగేది ప్రపంచ సంబంధము కాకుండా దైవ సంబంధమైనదిగా, సరైన జ్ఞానమార్గమును అనుసరించు నదిగా ఉండవలెను.  అడిగిన ప్రశ్న దైవికమైనదయితే దానికి ఆయన తప్పక జవాబు చెప్పును.  అయితే కొందరు మేము దైవికమయిన ప్రశ్నే అడిగాము,  అయినా లోపలగల ఆయన, మాకు సమీపముగా ఉన్నానని చెప్పిన ఆయన  ఏ జవాబు చెప్పలేదు, దీనికి మీరేమంటారు?  మాకు చెప్పనివాడు మీకు ఎలా చెప్పాడు? అని అడుగవచ్చును.

ఇలా అడుగ గలరని ఆయన తన వాక్యములో ముందే ఇట్లు చెప్పాడు. **'నా దాసులు నన్ను గురించి అడిగితే'** అని చెప్పుట వలన ఆయన దాసులు అడిగితేనే తాను జవాబు చెప్పుననీ,  మిగతావారు ఎవరు తన దాసులుగా నటించినా వారి మాటలు వినడనీ, వారికి జవాబు చెప్పడని తెలియు చున్నది.  అందువలన ముందునుండి తన దాసులుగా యున్నవారి మాటలను మాత్రమే ఆయన వినునని తెలియుచున్నది.  నేను నా జీవిత ప్రారంభమునుండి ఆయన దాసునిగా యున్నాను.  కావున నేను అడుగు ప్రతి ఆధ్యాత్మిక ప్రశ్నకు జవాబు దొరుకుచున్నది.  ప్రపంచ సంబంధమైన ప్రశ్న అడిగితే  దానికి నాకు కూడా జవాబుండదు.  నేను ద్వాపర యుగము చివరిలో చెప్పిన భగవద్గీతకు సంబంధించిన ప్రశ్నను అడిగాను.  అందువలన నాకు జవాబు దొరికినది.  అయితే ఆ జాబు ఎలావుందో క్రింద చూస్తాము.

నాకు దొరికిన జవాబు అత్యంత చేదు సత్యముగా యున్నది.  నా ఆత్మ చెప్పినది పూర్తి సత్యమే.  కావున నేను పూర్తిగా నమ్మాను.  ఇతరులు ఎవరూ నమ్మరని నేను అనుకొంటున్నాను.  ధర్మసంస్థాపన నిమిత్తము కృష్ణుడు భగవద్గీతను అత్యంత రహస్యముగా అర్జునునకు చెప్పాడు. అంతటితో ధర్మసంస్థాపణ జరిగినట్లే.  అయితే దుష్టులను లేకుండా

చేయవలసిన రెండవ పని కూడా ఆయన మీద ఉండుట వలన అప్పటి కాలములో అందరికంటే అత్యంత ఎక్కువ దుష్టత్వము కలిగిన వ్యక్తిని గుర్తించి, ఆయన వలననే మిగతా వారందరూ దుష్టులుగా మారుచున్నారని తలచిన కృష్ణుడు దుష్ట వినాశనము కొరకు పూనుకున్నాడు. అయితే దుష్ట నాశనము కత్తులతో చేయునది కాదు. తన బోధతో వారి దుష్ట భావమును మార్చుడమే **"వినాశాయచ దుష్కృతామ్"** అను మాటకు సరిపోవును. కావున కృష్ణుడు అర్జునుని ద్వారా తన బోధను ముందు వ్యాసుని వద్దకు చేరునట్లు చేశాడు. జ్ఞానము మీద ఏమాత్రము శ్రద్ధలేని వానికి జ్ఞానమును చెప్పి పథకము ప్రకారము తన జ్ఞానమును వ్యాసుని వద్దకు చేర్చాడు.

అయితే ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న రాగలదు. అదేమనగా! ధర్మముల బోధతో దుష్టులను మంచివారిగా మార్చి తర్వాత వారిలో దుష్ట భావములను లేకుండా చేయుటకు దుష్టుల వద్దకు తన జ్ఞానమును చేర్చ వలెనుగానీ భగవంతుడనీ, వ్యాసభగవాన్ అని పిలువబడుచున్న, చతుర్ముఖ బ్రహ్మతో సమానముగా చెప్పబడుచున్న వ్యాసుని వద్దకు అర్జునున్ని పథకము ప్రకారము ఎందుకు పంపాడు? అని సంశయము రాక తప్పదు. అప్పటికే వ్యాసుడు నాల్గువేదములను, అష్టాదశ పురాణములు, ఉపనిషత్తులు వ్రాసి ప్రజలకు పరిచయము చేసినాడు మరియు 'వ్యాసోనారాయణ' అని పిలువ బడుచున్న వ్యాసునివద్దకు కృష్ణుడు పథకము ప్రకారము ఎందుకు పంపాడో నాకు తెలిసినా నేను చెప్పను. ముందు ముందు భగవంతుడయిన కృష్ణుని పథకము గురించి మీకే తెలియగలదు.

జ్ఞానము మీద శ్రద్ధలేని అర్జునుడు, కృష్ణుడు చెప్పిన జ్ఞానమును వినగలిగినా, దానిని జీర్ణించుకోలేక వ్యాసునివద్దకు పోయి కక్కినట్లు అంతయూ చెప్పాడు. కృష్ణుడు అర్జునునకు చెప్పిన బోధను విన్న వ్యాసుడు

చలించిపోయాడు. తనలోయున్న భావములకు కృష్ణుడు చెప్పిన భావములకు ఎంతో తేడాయున్నట్లు గ్రహించాడు. కొద్ది రోజులుగా ఆలోచించి, ఆలోచించి చివరకు తనలో ముందున్న వ్యాసుడు ఉండకూడదని, క్రొత్త వ్యాసునిగా మారవలెనని అనుకొన్నాడు. వేదముల, పురాణముల రచనల వలన తనకు అమితమైన పాపము వచ్చియుంటుందని తలచిన వ్యాసుడు లోలోపల కృంగిపోయాడు. అగ్ని తగిలిన పటికవలె మారిపోయాడు. మారిన వ్యాసునిగా తాను వినిన బోధను గ్రంథరూపముగా చేయాలనుకొన్నాడు. కృష్ణుడు ఐదారు నిమిషములు చెప్పిన బోధను అర్జునుడు అరగంట వ్యవధిలో మాటలలో చెప్పగా వినిన వ్యాసుడు, ఏడు వందల (700) సంస్కృత శ్లోకములుగా వ్రాయడము జరిగినది. అలా ఒక్క వ్యాసున్ని మార్చుట వలన, వ్యాసుడు వ్రాసిన భగవద్గీత వలన లోకములోని దుష్టులందరూ మారగలరని కృష్ణుడు అనుకొని యుండవచ్చును. తర్వాత కాలములో తన జ్ఞానము భగవద్గీత రూపములో ఎంతోమందిని మార్చగలదని పథకము ప్రకారము వ్యాసున్ని మార్చి ఆయన ద్వారా భగవద్గీతను వ్రాయించినా, భగవద్గీతా జ్ఞానము కలియుగములో గ్రంథరూపముగాయున్నా, మాయ ప్రభావము వలన భూమిమీద కొందరు మారినా చాలామంది దుష్టులుగానే మిగిలిపోయారు. దానిని సరిదిద్దుటకు **"దేవుని రాకకు ఇది సమయము కాదా?"** అని అనవచ్చును.

**ప్రశ్న :- మీరు చెప్పిన విషయమును బాగా గ్రహించితే కృష్ణుని దృష్టిలో వ్యాసుడే మొదటి దుష్టుడిగా యున్నట్లు తెలియుచున్నది. అందుకే వ్యాసున్ని మొదటనే మార్చాలనుకొని అర్జునున్ని ముందుగా వ్యాసునివద్దకు పంపినట్లు మాకర్థమగుచున్నది. మేము అనుకున్నది నిజమే కదా!**

**జవాబు :-** చెప్పిన దానినిబట్టి మీరు ఎట్లయినా అనుకోవచ్చును. వ్యాసున్ని

గురించి నేను ఏమీ చెప్పలేదు. అయితే వ్యాసుడు అర్జునుడు చెప్పిన బోధను విని తాను అధర్మములను బోధించిన వానిగా లెక్కించుకొన్నాడు. కృష్ణుడు చెప్పిన 'దుష్టనాశనము' నాతోనే మొదలు కావలెనని అనుకొన్నాడు. అందువలన తాను మారిపోయి ముందు తాను వ్రాసిన వేదములకు తానే వ్యతిరేఖముగా వ్రాశాడు. 'వేదములను' గుణమయములయిన 'మాయ'గా పోల్చి చెప్పాడు. మరియొకచోట తాను ముందు తెల్పిన **'వేదముల వలన, యజ్ఞముల వలన, దానముల వలన, తపస్సుల వలన దేవుడు తెలియబడడని'** కృష్ణుడు చెప్పినట్లే సంకోచించక వ్రాశాడు. అదే విధానము ప్రకారము కృష్ణుడు చెప్పినట్లు వేదములను **'మాయ'** అని వర్ణించాడు. ఈ విధముగా తాను చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తముగా భగవద్గీతను చందోబద్ధముగా వ్రాయడము జరిగినది. వ్యాసుడు భగవద్గీతను వ్రాసి చనిపోయిన తర్వాత కొందరు స్వార్థపరులు తమకు అనుకూలమైన శ్లోకములను భగవద్గీతలో కలిపి భగవద్గీతను కొంత కాలుష్యము చేశారు.

భగవద్గీతలో అర్జున విషాదయోగము భగవంతుడు చెప్పిన బోధకు సంబంధములేదు. అందువలన **భగవద్గీతలో గల 700 శ్లోకములలో అర్జున విషాద యోగము యొక్క 46 శ్లోకములు తీసివేస్తే 654 శ్లోకములుండును. అయితే 54 శ్లోకములు అన్ని అధ్యాయములలో కల్పిత శ్లోకములు గలవు. వాటి వివరము సాంఖ్యయోగములో 7, కర్మయోగములో 7, జ్ఞాన యోగములో 9, ఆత్మసంయమ యోగములో 1, విశ్వరూప సందర్శన యోగములో 10, శ్రద్ధాత్రయ విభాగయోగములో 6, మోక్ష సన్న్యాస యోగములో 14 మొత్తము 54 కల్పిత శ్లోకములను తీసివేయగా మొత్తము 600 శ్లోకములు మాత్రమే భగవద్గీతయని చెప్పవచ్చును. 700 శ్లోకముల భగవద్గీతలో 46 అర్జున విషాదయోగము**

**భగవద్గీత పేరుకు సంబంధము లేనిది. తర్వాత 54 కల్పిత శ్లోకములు మొత్తము 100 శ్లోకములు అధికముగా కల్పించబడినవి. అందులో 54 శ్లోకములను మాత్రము వ్యాసుడు చనిపోయిన తర్వాత చేర్చబడినవి.**

ఐదువేల సంవత్సరముల ముందు చెప్పిన భగవద్గీత నేడు కొంత కలుషితమైయున్నది. ఆ కలుషితమును తీసివేసి అసలయిన జ్ఞానమిదియని చెప్పుటకు ఆనాడు చెప్పిన దేవుడే దిగి రావలసి యున్నది. అంతేకాక ఒక్కమారు చెప్పిన బోధతో తిమింగలము లాంటి ఒక్క వ్యాసున్ని మార్చగలిగిన కృష్ణుడు చెప్పిన భగవద్గీత 54 శ్లోకముల కలుషితమై పోవడమేకాక శ్లోకములకు వాస్తవ భావములు లేకుండా పోయి, ఎవరి ఇష్టానుసారము వారు చెప్పుకోవడమైనది. ఇటువంటి సమయమును చూస్తే ఎవరికయినా **"ఇది దేవుని రాకకు సమయము కాదా?"** అనిపించును. **"అధర్మములు చెలరేగినప్పుడు ఏ యుగమందైనా నేను వచ్చి తిరిగి ధర్మములను ప్రతిష్ఠించి అధర్మములను లేకుండా చేస్తానని"** దేవుడు చెప్పాడు. అయితే ప్రస్తుత కాలములో దేవుని ధర్మములు ఏవో ఎవరికీ తెలియకుండా పోయినవి. ముఖ్యముగా స్వామీజీలుగాయుండి ప్రజలకు దైవజ్ఞాన బోధలు చెప్పు వారికే ధర్మములు ఏవో తెలియకుండా పోయాయి. స్వామీజీలుగా యున్నవారే తాము ఆచరించునవే ధర్మములనుకొని అధర్మములను ఆచరించుచున్నారు. ధర్మముల ప్రస్తావన స్వామీజీలుగా యున్న వారివద్దే లేనప్పుడు సామాన్య ప్రజానీకానికి ధర్మముల విషయము ఎలా తెలియ గలదు? దేవుడు సృష్ట్యాదిలో చెప్పిన బోధలోనే ధర్మములను, అధర్మములను తెలియజేయడమైనది. అదే జ్ఞానమునే కృష్ణుడు చెప్పగా, దానినే భగవద్గీతగా వ్రాయడమైనది. భగవద్గీతలో 'ధర్మసంస్థాపన చేయుటకు అధర్మములను లేకుండా చేయుటకు వస్తానని' చెప్పినప్పుడే ధర్మములను, అధర్మములను

చెప్పియున్నాడు. అవి నేటికీ భగవద్గీతా గ్రంథములో శ్లోకముల రూపములో వ్రాయబడియున్నా ధర్మములను ఎవరూ గుర్తించడము లేదు. అధర్మములనే ధర్మములుగా గుర్తించి వాటినే అందరూ ఆచరించుచున్నారు.

భగవద్గీతను బోధగా చెప్పు స్వామీజీలే ఇవి ధర్మములు, ఇవి అధర్మములని భగవద్గీతలో చెప్పిన వాటిని గుర్తించి చెప్పకుండా, అధర్మములుగా చెప్పబడిన వాటినే తాము ఆచరించుచూ, ఇతరులను కూడా ఆచరింపజేయుచున్నారు. అధర్మములయిన నాలుగు చర్యల ద్వారా దేవుడు తెలియుటకు శక్యము కాదని భగవద్గీతలోనే కృష్ణుడు చెప్పియున్నాడు. అట్లే ధర్మములయిన మూడు చర్యల ద్వారా దేవుడు తెలియబడునని చెప్పి యున్నాడు. అయితే ఆ విషయమును బోధకులయిన స్వామీజీలు ఏమాత్రము బయటికి చెప్పడము లేదు. ముందు వారికే ధర్మములు, అధర్మముల విషయములో అవగాహన లేకుండా పోయినది. వారు గ్రుడ్డివారై ధర్మములను అధర్మములుగా, అధర్మములను ధర్మములుగా అనుకోవడము జరుగుచున్నది. అందువలన **అధర్మముల స్థానములోయున్న యజ్ఞముల ఆచరణ, వేదముల పఠన, దానము చేయుట, తపస్సులు చేయుట అను కార్యములను ఆచరించుచున్నారు. ధర్మము విషయమును విపులముగా కర్మయోగ ఆచరణ, బ్రహ్మయోగ స్థబ్దత, భక్తియోగ ఆచరణ** చెప్పియుండగా వాటిని గురించి ఏమాత్రము తెలియకయున్నారు. కర్మ యోగమునకు చెప్పిన శ్లోకములకు పెడార్థమును చెప్పుచున్నారు. అట్లే బ్రహ్మయోగమును చెప్పిన శ్లోకముల వివరములో అశాస్త్రీయముగా చెప్పుచున్నారు. ఇక భక్తియోగ విషయములోనికి వస్తే అదేదో తెలియకుండా పోయినది.

ఈ విధముగా నేటి సమాజమునకు ధర్మాధర్మములు తెలియక పోవడము వలన పెద్దలయిన స్వామీజీలు చెప్పిన వాటినే విని ఆచరించు

చున్నారు. స్వామీజీలు ప్రతి భక్తి విషయములోనూ మనుషుల చేత యజ్ఞములు చేయించుచున్నారు. ప్రతి శుభకార్యములోను యజ్ఞాచరణ తప్పనిసరిగా చేయడము తప్పలేదు. అట్లు యజ్ఞములు చేయునప్పుడు దానికి అనుబంధముగా వేదమంత్రములను చదువుచూ వేదపఠనము చేయు చున్నారు. అలా ఒక శుభకార్యమును చేసిన తర్వాత అక్కడ యజ్ఞములో పాల్గొనిన వారందరికీ దానములు చేయడము కూడా తప్పనిసరిగా చెప్పు చున్నారు. ఈ విధముగా హిందువులయిన వారు అందరూ మూడు అధర్మములను తప్పక ఆచరించుచున్నారు. అంతేకాక ప్రతి దినముగానీ, అప్పుడప్పుడుగానీ 'ధ్యానము' అను పేరుతో లేక 'మెడిటేషన్' అను పేరుతో ఏదో ఒక మంత్రమునో, ఒక పేరునో, ఒక ఆకారమునో ధ్యానించడము చేయుచుందురు. ధ్యానములో ఒక దానిని తపించడము తప్ప ఇంకొకటి ఏమీ ఉండదు. అందువలన అటువంటి ధ్యాన ప్రక్రియను తపస్సుయని అనవచ్చును. హిందువులలో చాలామంది మూడు అధర్మములను ఆచరించుచుండగా కొందరు తపస్సు కూడా చేయుచూ మొత్తము నాలుగు అధర్మములను ఆచరించుచున్నారు. 'అధర్మ ఆచరణ ఉండకూడదు' అని దేవుడు లేక అల్లాహ్ లేక ఎహోవా అని బిరుదాంకితుడైన పరమాత్మ శక్తి తన జ్ఞానములో చెప్పియుండగా, మనిషి ముఖ్యముగా అధర్మములనే ఆచరించుచూ వాటినే ధర్మములని అంటున్నాడు. ఈ విధముగా మనుషులు అధర్మయుక్తులైయున్నప్పుడు **ఇది దేవుని రాకకు సమయము కాదా?** యను జ్ఞాపకము వచ్చుచున్నది.

దేవుడు సృష్ట్యాదిలో ఆకాశము ద్వారా చెప్పించిన జ్ఞానము దాదాపు ఐదువేల సంవత్సరముల పూర్వము, అధర్మములను వ్రాసిన వ్యాసుని చేతనే దేవుడు భగవద్గీతా గ్రంథమును వ్రాయునట్లు చేశాడు. ప్రపంచములో

అంతవరకు ఏ ఆధ్యాత్మిక గ్రంథము లేనందువలన ద్వాపరయుగము చివరిలో తయారయిన మొదటి గ్రంథము **"భగవద్గీత'** అయినందున దానిని **"ప్రథమ దైవగ్రంథము"** అని చెప్పుచున్నాము. భగవద్గీత తయారయిన తర్వాత మూడువేల సంవత్సరములకు రెండవ దైవగ్రంథమయిన **'ఇంజీలు'** తయారయినది. ఇంజీలు అనగా బైబిలు అని అర్థము. ఇంజీలులో కృష్ణునివలె వచ్చిన ఏసు చెప్పిన జ్ఞానమును వ్రాయడము జరిగినది. అందులో ఏసు చెప్పిన జ్ఞానము కేవలము నాలుగు సువార్తల రూపముగా యున్నది. అయితే బైబిలు మధ్యలో నాలుగు సువార్తల జ్ఞానముండగా దానికంటే ముందు పాత నిబంధన అని 39 అంశములు గలవు. అలాగే నాలుగు సువార్తలకంటే వెనుక 23 అంశములు గలవు. మొత్తము 66 పాఠములుండగా, మధ్యలోని నాలుగు సువార్తలను తీసివేయగా మిగిలిన 62 పాఠములు ఏసు చెప్పినవి కావు. ఏసు చెప్పిన జ్ఞానము నాలుగు సువార్తలలోనేయుండగా ఆ నాలుగుకు ప్రత్యేకముగా **"సువార్తలు"** అని పేరు పెట్టడమైనది.

ద్వితీయ దైవగ్రంథముగా పేరుగాంచిన ఇంజీలు (బైబిలు) లోని నాలుగు సువార్తలయందు భగవద్గీతలో చెప్పిన సృష్ఠి ఆదిలోని జ్ఞానమే ఉన్నది. అయితే భగవద్గీతలో ఉన్నట్లే ఉండక ఒకే భావమునే భావము మారకుండా భాషను మార్చి వ్రాసియుండుట వలన ఇది భగవద్గీత జ్ఞానమని క్రైస్థవులకు తెలియకుండా పోయినది. క్రైస్థవులు బైబిలులో గల నాలుగు సువార్తలలోని దేవుని జ్ఞానమునే కాకుండా మిగతా 62 పాఠముల జ్ఞానమును చదువుట వలన ఏవి మనుషులు చెప్పిన మాటలు, ఏవి దేవుడు చెప్పిన జ్ఞానమని తెలియకుండా పోయినది. దానివలన బైబిలు చదువు క్రైస్థవులందరూ 66 పాఠములను కలుపుకొని చదువుచున్నారు. అందువలన

ఏది దేవుని మాట, ఏది మనుషుల మాటయని అర్థము కాకుండా పోయినది. క్రైస్థవులు నాలుగు సువార్తలలోని జ్ఞానమును ప్రత్యేకముగా గుర్తించలేక పోయారు.

బైబిలు మధ్యలో గల నాలుగు సువార్తలలో దేవుని ధర్మములుండగా, మిగతా బైబిలు గ్రంథమందు అనగా నాలుగు సువార్తల వెనుకాముందు దైవజ్ఞానమువలె కనిపించు అజ్ఞానము కూడా యున్నది. నాలుగు సువార్తల లోని జ్ఞానముకంటే ఎంతో గొప్పగా మిగతా ముందు వెనుకగల పాఠములలో కనిపించుచుండునని చెప్పవచ్చును. అయితే మనుషులు అధర్మములుగా యున్న వాటిని ధర్మములుగా భావించినట్లు, మిగతా 62 పాఠములలోయున్న వాటిని కూడా క్రైస్థవులు అసలయిన జ్ఞానముగా భావించుకొనుట వలన ఏసు చెప్పిన జ్ఞానము వారికి సరిగా అర్థము కాకుండా పోయినది. ఐదువేల సంవత్సరములయినా భగవద్గీత హిందువులకు ఎలా అర్థము కాకుండా పోయినదో, అలాగే బైబిలు వచ్చి రెండు వేల సంవత్సరములయినా బైబిలులోని జ్ఞానము రవ్వంత కూడా క్రైస్థవులకు అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ఏసు అను వ్యక్తి మనిషిగా కనిపించి చెప్పిన జ్ఞానము, జ్ఞానముగా కనిపించక ఆయన అప్పటికి తగినట్లు మాట్లాడిన మాటలుగా అందరికీ అర్థమయినవి. ఏసు చెప్పిన మాటలలోని సారాంశము భగవద్గీతలో చెప్పిన జ్ఞానముతో సమానముగా యున్నదని చాలామంది క్రైస్థవులకు తెలియదు. మేము ఏసు చెప్పిన జ్ఞానము, కృష్ణుడు చెప్పిన జ్ఞానము రెండు ఒక్కటేయంటే క్రైస్థవులకు ఏమీ అర్థముకాక ఏసు జ్ఞానమును కృష్ణుని జ్ఞానమును తూర్పు పడమరలుగా చూస్తున్నారు. ఏసు కృష్ణుడు ఒక్కరేయని చెప్పితే ఆ మాట పూర్తి అజీర్ణమగుచున్నది.

దేవుని జ్ఞానమును దేవుడే చెప్పవలసియుండగా, దేవుడు ప్రజలకు తన జ్ఞానము చెప్పు నిమిత్తము ఆయనే రావలసియున్నది. అయితే దేవుడు

నేరుగా ఎవరితోనూ మాట్లాడడను నియమమును అనుసరించి, దేవుడు దేవుడుగా కాకుండా భగవంతునిగా వచ్చుచున్నాడు. దేవుడు కనిపించని వాడు కాగా, భగవంతుడు కనిపించు శరీరముతోయుండును. **దేవుడు నామ, రూప, క్రియ అను మూడు లేనివాడు కాగా, భగవంతుడు నామ, రూప, క్రియలు గలవాడైయుండును.** దేవుడు భగవంతునిగా భూమిమీదికి వచ్చినప్పుడు ఆయనను ఎవరూ గుర్తించనట్లు తన జీవితమును నిర్ణయించుకొని పుట్టును. ముందే ఒక పథకము ప్రకారము పుట్టిన భగవంతున్ని దేవుడని ఎవరూ గ్రహించలేరు. అదే విధానము ప్రకారము భగవద్గీతను చెప్పిన కృష్ణునిగా దేవుడు రావడము జరిగినది. కృష్ణునిగా శరీరమును ధరించి వచ్చిన దేవున్ని ఆ రోజు ఎవరూ గుర్తించ లేకపోయారు. ఒక్క భీష్మునికి తప్ప కృష్ణుడు ఎవరయినది మిగతావారికి ఎవరికీ తెలియదు. కృష్ణుడు దేవుడని నిరూపించుటకు సాక్ష్యముగా భీష్మునికి ఒక్కనికి మాత్రము కృష్ణుడు దేవుడని తెలుసు. అయితే ఆయన భౌతికముగా గడిపిన జీవితమును చూస్తే, కృష్ణున్ని దేవుడని కాదు కనీసము జ్ఞాని అని కూడా అనరు. జ్ఞానములేని మనిషి ప్రవర్తించినట్లే కృష్ణుడు తన నిజ జీవితములో ప్రవర్తించాడు.

కృష్ణుని జీవితము ఒక విధముగా కాగా, ఏసు జీవితము మరొక విధముగా యున్నది. కృష్ణుడు ధనికుడుగా జీవించితే, ఏసు పూర్తి పేదవానిగా బ్రతికాడు. ఇద్దరి జీవితములను పరిశీలించి చూస్తే పూర్తి వేరువేరు విధానములుగాయున్నది. భారతదేశమున కృష్ణునిగా వచ్చిన దేవుడే ఇశ్రయేలు దేశమున ఏసుగా వచ్చాడని ఎవరూ ఊహించలేరు. అయినా కృష్ణుడు చెప్పిన జ్ఞానమునే ఏసు చెప్పడము జరిగినది. భౌతికముగా వేరు వేరుగా కనిపించు కృష్ణుడు, ఏసు ఆధ్యాత్మికముగా పరిశీలించితే ఇద్దరూ

ఒకే జ్ఞానమును చెప్పినట్లు అర్థమగును.  అయితే మనుషులకు భౌతిక దృష్టి తప్ప ఆధ్యాత్మిక దృష్టి లేనందువలన  కృష్ణుడు, ఏసు ఇద్దరు ఒక్కరేయను విషయము తెలియకుండా పోయినది.  ఏసు జీవితములో ఆయనను నమ్మి ఆయన వెంట తిరిగిన శిష్యులు కేవలము పదకొండుమందే.  ఆ పదకొండు మంది కూడా కొన్ని సమయములలో ఏసును పూర్తిగా నమ్మలేక పోయారు.  ఆయన మాటను పూర్తి విశ్వసించలేకపోయారు.  ఏసు తన తాత్కాలిక మరణమునుండి లేచివచ్చిన తర్వాత  ఆయనను పూర్తిగా నమ్మ లేకపోయారు.  మనిషిగా, తమ గురువుగా ఆయనను చూడకుండా  ఒక దయ్యము వచ్చి మాట్లాడినట్లు భావించారు.  అందువలన ఏసు తన శిష్యులకు శిలువ సంఘటన తర్వాత 33 మార్లు మాత్రము కనిపించి తర్వాత అక్కడనుండి పరదేశమునకు వెళ్ళిపోవడము జరిగినది.  ఇదంతయూ భౌతికముగా చూస్తే  ఆయనను దేవుడని ఎవరూ నమ్మరు.  నమ్మకూడదనేదే దేవుని  భావము.

ఏసు తన జీవితములో చెప్పిన బోధలు  భగవద్గీతలోని కొన్ని వాక్యములకు సమానముగా ఉండినా,  అక్కడ 'భగవద్గీత'లో చెప్పిన దానికి ఇక్కడ 'సువార్తలు'లో చెప్పిన దానికి పోలికను ఎవరూ గుర్తించలేదు. అందువలన కృష్ణుడు, ఏసు చెప్పిన ఒకే జ్ఞానమును  వేరువేరు జ్ఞానములుగా మనుషులు అనుకోవడము జరుగుచున్నది.  జ్ఞానములు వేరువేరనుకొన్న మనుషులు అంతటితో ఆగక మతములను సృష్టించుకొన్నారు.  దానితో మా మతము వేరు, మా జ్ఞానము వేరు, మా దేవుడు వేరని చెప్పుకోవడము జరుగుచున్నది.  మూడు యుగములలో నాలుగు అధర్మములుండగా ఆ నాలుగు అధర్మములను గురించి  కృష్ణ భగవానుడు తన భగవద్గీతలో చెప్పడమైనది.  అలా చెప్పిన తర్వాత  కలియుగములో ఏసుపుట్టి జ్ఞానము

చెప్పిన తర్వాత **మతము** అనునది ప్రారంభమయినది. అంతవరకు లేని మతము ఏసు వచ్చిన తర్వాత వచ్చి మొదట చిన్న సంఘముగా తయారై, తర్వాత పెద్ద సమాజముగా తయారై, చివరికది మతముగా రూపుదిద్దు కోవడము జరిగినది. ఏసు బ్రతికియున్నప్పుడే 'మతము' అనునది తయారు కావడము ప్రారంభమయినది..

'మతము' అనునది క్రొత్తగా పుట్టిన ఐదవ అధర్మముగా తయారైనది. ఆ విధముగా కలియుగములో రెండువేల సంవత్సరముల క్రిందట పుట్టిన మతము నేడు పూర్తి బలమైన అధర్మముగా రూపుదిద్దుకొన్నది. నాలుగు అధర్మములున్న ద్వాపరయుగములోనే అధర్మములను నిర్మూలించుటకు కృష్ణుడు జ్ఞానము చెప్పితే, అధర్మములు కొంత అణిగినట్లణిగి తిరిగి బలమును చేకూర్చుకొన్నవి. అంతటితో ఆగక కలియుగములో ఐదవ అధర్మమయిన 'మతము' అనునది పుట్టుకొచ్చినది. నాలుగు అధర్మములు ఉన్నప్పుడే దేవుడు భగవంతునిగా వచ్చాడు. ఐదు అధర్మములున్నప్పుడు **ఇది దేవుని రాకకు సమయము కాదా?**యని చెప్పవచ్చును. ఈ సమయములో దేవుడు తప్పక వచ్చి ఐదవ అధర్మమును రూపుమాపటానికి ప్రయత్నించునని అనుకొంటున్నాము. ఏసు తన జీవిత కాలములోనే 'మతము' అను అధర్మము పురుడు పోసుకొన్నదని గ్రహించాడు. అయితే అప్పుడు మతమునకు సంబంధించిన విషయమును చెప్పినా ప్రజలు అర్థము చేసుకొను స్థితిలో లేరని అనుకొన్నాడు. అందువలన ఏసు తన నోటివెంట ఒక మాటను అన్నాడు. అది యోహాన్ సువార్త 16వ అధ్యాయము 12వ వచనము ఇలాగున్నది. **(యోహాన్-16-12) "నేను మీతో చెప్ప వలసినవి ఇంకనూ అనేక సంగతులు గలవు గానీ వాటిని మీరు ఇప్పుడు సహింపలేరు"** అని అన్నాడు. అప్పుడు మతమును గురించిన

చెప్పవలసిన సమాచారమున్నా, అప్పుడే పుట్టిన మతము గురించి చాలామందికి ఏమీ తెలియదు. అందువలన 'మీకు ఇప్పుడు చెప్పినా అర్థముకాదు' అను ఉద్దేశ్యముతో అలా చెప్పాడు అని అనుకొందాము.

**ప్రశ్న :- దేవుడు ద్వాపరయుగము చివరిలో భగవంతుడుగా వచ్చి దుష్కృతములను వినాశనము చేసి ధర్మసంస్థాపన మొనర్చియుంటే అప్పటి నుండి ఇప్పటి వరకు ఎట్లున్న అధర్మములు అట్లే ఉన్నాయి కదా! అని ప్రశ్నించుచున్నాము. అట్లే ఆనాడు నాలుగు అధర్మములే ఉన్నాయి. నేడు ఇంకొక అధర్మము పుట్టి మొత్తము ఐదు అధర్మములయినాయి. దీని ప్రకారము భగవద్గీతా జ్ఞానమును చెప్పినప్పటికీ అధర్మ క్షీణత జరుగలేదు. అటువంటప్పుడు ద్వాపరయుగములో భగవంతుడు వచ్చి ఏమి చేసినట్లు?**

**జవాబు :-** దేవుడు భూమిమీద అవతరించి ధర్మసంస్థపాన చేయుట, అధర్మ నిర్మూలన చేయుట చేయునని మనము గ్రంథములో చదివాము. అయితే ఇక్కడ ఎవరికీ తెలియని విధానమొకటున్నది అదేమనగా! దేవుడు మూడు ఆత్మలుగా యున్నాడు. కావున దేవుడు భగవంతునిగా మూడుమార్లు పుట్టితే దేవునికి ఒక అవతారమగును. దేవుడు ఒకమారు అవతరించి ధర్మసంస్థాపన చేయును అంటే అది ఒకమారు పుట్టుటతో అయిపోదు. దేవుడు మూడుమార్లు భగవంతుడుగా వస్తే దేవునికి ఒక అవతారమగును. అప్పుడు పూర్తి అధర్మముల నిర్మూలన జరుగును మరియు పూర్తిగా ధర్మసంస్థాపన జరుగును. ఈ విధానము తెలియనివారు కృష్ణుడుగా వచ్చినది దేవునికి ఒక అవతరణ అనుకోవడము పొరపాటు. కృష్ణ జన్మ దేవుని అవతరణలో ఒక భాగమేగానీ, ఒక అవతారము కాదు. ధర్మసంస్థాపన కొరకు **"సంభవామి యుగేయుగే"** అన్నాడు. అనగా "ధర్మసంస్థాపన కొరకు ఏ

యుగములో అయినా వస్తాను" అని చెప్పడమైనది. కృష్ణుని జన్మ ద్వాపర యుగము చివరిలో కలియుగము ప్రారంభములో జరిగినది. ద్వాపర యుగమునకు, కలియుగమునకు సంధి కాలములో ద్వాపర యుగములో కొద్దిగా జరిగినందున, కలియుగ సంధి ఎక్కువగా యుండుట వలన కృష్ణుని జన్మ ద్వాపరయుగములోనే జరిగినదని తేల్చి చెప్పవచ్చును.

దీనినిబట్టి కృష్ణుని జన్మ ద్వాపర యుగమునకు సంబంధించినదేనని నిర్ణయించడమైనది. ఏ యుగములో దేవుడు అవతరించినా రెండు, మూడు యుగములలోనే మూడు అవతరణలు రావచ్చును. అలా వస్తే ద్వాపర యుగములో దేవునికి ఒక్క అవతారము జరిగినట్లగును. కృష్ణుని జన్మ దేవుని అవతారములో ఒక భాగమగుట వలన, దేవుడు వచ్చిన పని ఒక భాగము మాత్రమే నెరవేరునని చెప్పవచ్చును. అయితే కృష్ణుడు వచ్చి ఏమి చేశాడు? అని ప్రశ్నించుకొని చూస్తే, ఆయన వచ్చి అధర్మములు ఎక్కడ పుట్టాయో అక్కడనే ధర్మప్రతిష్టాపన చేయాలనుకొన్నాడు. అందువలన అధర్మములను ఒకచోట చేర్చి గ్రంథములుగా వ్రాసిన వ్యాసుడు ఆ కాలములో అతిపెద్ద దుష్టుడని లెక్కించి ఆయననే ముందు మార్చాలను కొన్నాడు. ఒక పథకము ప్రకారము తన బోధను అర్జునునికి చెప్పి తర్వాత ఆ బోధను వ్యాసుని వద్దకు అర్జునుని ద్వారా పోవునట్లు చేశాడు. కృష్ణుడు చెప్పిన జ్ఞానమును వినిన మొదటి వ్యక్తి అర్జునుడుకాగా, కృష్ణుడు చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకొన్న మొదట వ్యక్తి వేదవ్యాసుడు అని చెప్పవచ్చును. అదే కృష్ణుడు నేరుగా వ్యాసునికి చెప్పియుంటే వ్యాసుడు వినేవాడు కాదు. అర్జునుని ద్వారా చేరిన జ్ఞానమును వ్యాసుడు గ్రహించగలిగాడు. అలా గ్రహించిన వాడు తాను వేదములను, పురాణములను వ్రాసి తప్పు చేశానని అర్థము చేసుకొన్నాడు. తన అజ్ఞాన చర్యకు తానే బాధపడి, ప్రాశ్చాత్తాపముతో

కృంగిపోయి, పాపపరిహార నిమిత్తము కృష్ణుడు చెప్పిన బోధను గ్రంథ రూపముగా వ్రాయుట వలన వ్యాసుడు పూర్తి మారిపోయాడని అందరికీ తెలిసినది.

అప్పటికే మనుషులలోనికి ప్రాకిపోయిన వేదములను కొందరు వ్యాసుని మార్పును చూచి వదలివేశారు. వ్యాసుని పరివర్తనను గ్రహించిన బహుకొద్దిమంది వేదములకు దూరముగా ఉండిపోయారు. అయితే వ్యాసునిలోని మార్పును చాలామంది గ్రహించలేక పోయారు. వ్యాసుడు మారిపోయినది భగవద్గీతా జ్ఞానము వలన అని వారికి తెలియదు. కొందరికి వ్యాసుని మార్పు కనిపించినా, వారి స్వార్థము కొరకు వేదములను అంటి పెట్టుకొన్నారు. మొత్తము మీద కృష్ణుడు ఒక్కమారు తన జ్ఞానమును అర్జునునకు మాత్రము చెప్పి, వేదములకు పునాది వేసిన వానిని లేకుండా చేసి సన్మార్గునిగా మార్చివేశాడు. దేవుని జన్మలో ఒక భాగమయిన కృష్ణ జన్మలో ప్రథమ దైవగ్రంథమును ప్రకటించి ధర్మసంస్థాపనకు నాంది పలికాడు. అలాగే దుష్ట వినాశనములో భాగముగా 'వ్యాసో నారాయణ' అని పేరుగాంచిన ఐరావతములాంటి వ్యాసున్ని ఆయన భావము నుండి మార్చివేసి దుష్టశిక్షణకు కూడా నాంది పలికాడు. అలా ప్రప్రథమమయిన రెండు పనులను కృష్ణుడు తన ఒక్క బోధతో సాధించగలిగాడు. దేవుని అవతారములో భాగమయిన కృష్ణ జన్మలో ఒక్క అర్జునునికి మాత్రమే ఒక్కమారు తప్ప రెండవమారు జ్ఞానమును చెప్పలేదు. దేవుని అవతారములో మొదటి భాగమయిన కృష్ణుడు అంతతప్ప ఆ జన్మలో రెండవ వ్యక్తికి బోధించలేదు, రెండవ మారు బోధించలేదు. కృష్ణుడు బ్రతికిన 126 సంవత్సరముల కాలములో ఎవరూ వినకుండా ఐదారు నిమిషములు మాత్రము బోధను చెప్పి, మిగతా కాలమంతయూ అన్ని పనులు చేయుచూ

హాయిగా కాలము గడిపాడు. అందువలన ఆయన భగవంతుడని ఎవరూ గుర్తించలేకపోయారు.

**ప్రశ్న :- దేవుని అవతారము మూడు జన్మలతో కూడుకొనియుండునని ఇంతవరకు ఎవరూ చెప్పలేదు. ఏ గ్రంథములోనూ వ్రాయలేదు. ఎవరూ చెప్పనిది, ఎక్కడా వ్రాయనిది మీరెలా చెప్పుచున్నారు? మీ మాటకు ఏదయినా శాస్త్రాధారమున్నదా? లేక ప్రత్యక్ష ఆధారమున్నదా?**

**జవాబు :- 'దేవుడు'** అనగా మూడు భాగములుగా, మూడు ఆత్మలుగా యున్నవాడని ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో చెప్పడమైనది. అట్లే దేవుని అవతారము కూడా మూడు భాగములుగా ఉండునని తప్పక అనుకోవలసియున్నది. దీనికి శాస్త్రాధారముకంటే ప్రత్యక్షాధారము ముఖ్యముగా యున్నది. కృష్ణుడు భగవంతునిగా వచ్చినప్పుడు పూర్తిగా అధర్మ నిర్మూలన కాలేదు. అలాగే పూర్తిగా ఎక్కువ సంఖ్యలో దుష్టులను కూడా సన్మార్గులుగా మార్చలేదు. అందువలన కృష్ణుని తర్వాత ఇంకా రెండు జన్మలున్నాయని గట్టిగా చెప్పవలసి వచ్చినది. ధర్మ సంస్థాపన మొనర్చుటకు, యుగ యుగమునందు అని యుగే యుగే అని చెప్పడములో ఒక ధర్మసంస్థాపనకు రెండు మూడు యుగములు పట్టునని తెలియుచున్నది. ద్వాపరయుగ చివరిలోనే కాకుండా కలియుగములో కూడా ఆ కార్యము జరుగుని అర్థము చేసుకోవచ్చును. కృష్ణుని జన్మ ద్వాపర యుగములోనిది కాగా, కలియుగము మొదటిలోనే రెండవ జన్మయిన ఏసుగా వచ్చాడు. ఇంకా జరుగబోవు కాలము కలియుగము చాలాయున్నది కనుక దేవుని అవతారములోని మూడవ భాగము కూడా కలియుగములోనే రావచ్చునని చెప్పవచ్చును. దేవుని అవతారములోని రెండవ జన్మ ఇజ్రయేలు దేశములో జరిగిపోయి ఇప్పటికి రెండు వేల సంవత్సరములయినది. ద్వాపర యుగము

చివరిలో పుట్టిన కృష్ణునికి, కలియుగములో పుట్టిన ఏసుకు మూడు వేల సంవత్సరములు మధ్యలో గడచినది. ఇక రాబోవునది దేవుని అవతారములో మూడవ భాగమయిన భగవంతుని జన్మ రావలసియున్నది.

ద్వాపర యుగము చివరిలో పుట్టిన కృష్ణుడు భారతదేశములో పుట్టగా, కలియుగములో పుట్టిన ఏసు ఇజ్రయేల్ దేశములో పుట్టడమైనది. అయితే ఏసు చనిపోయినది భారతదేశములోనే, కృష్ణుడు చనిపోయినది భారతదేశములోనే. ఇక మూడవ జన్మగా వచ్చు భగవంతుడు కూడా భారతదేశములోనే చనిపోవలసియున్నది. ఏసు చనిపోకముందు తర్వాత జన్మను భారతదేశములోనే తీసుకోవాలని నిర్ణయించుకొన్నట్లు కొంత సమాచారము **"ఏసు చనిపోయాడా! చంపబడ్డాడా?"** అను గ్రంథములో ఉండడము వలన దేవుని మూడవ జన్మ భారతదేశములోనే జరుగునని తెలియుచున్నది. 'ఎప్పుడు' అను విషయము తెలియదు. కావున తర్వాత కాలములో భగవంతుడు పుట్టవచ్చును లేక ఇప్పటికే జరిగిపోయిన కాలములో పుట్టియుండవచ్చును. అయితే ఆయన ఎప్పుడు వచ్చినా భూమి మీద ఏ మానవుడు తనను గుర్తించలేని విధముగా వచ్చును. ఎవనికయినా ఇతను భగవంతుని అవతారమేనని ఒక్క అనుమానము వచ్చినా, అతనిలో వందల కొద్ది ఇతను దేవుని అవతారమయిన భగవంతుడు కాదు అనునట్లు అనుమానములు పుట్టును. అందువలన దేవుడు భగవంతునిగా ఎక్కడా ఎవరి చేత గుర్తింపబడడు.

**ప్రశ్న :- ఇప్పటికి రెండు అవతారములు వచ్చాయని తెలిసినది. రెండు అవతారములలోని బోధలు రెండు దైవగ్రంథములుగా వచ్చినవి. ఇప్పుడు మూడవ దైవగ్రంథము ఎప్పుడు వచ్చినా, అప్పుడు దేవుని అవతారము వచ్చినదని సులభముగా గ్రహించవచ్చును కదా!**

**జవాబు :-** ఈ ఉపాయము ఇప్పటికే చాలామందిలో కల్గినదని చెప్పవచ్చును. అయితే ఈ మారు దేవుడు అటువంటి అవకాశమును కూడా ఎవ్వరికీ ఇవ్వలేదు. ఎందుకనగా! కలియుగములో తృతీయ దైవగ్రంథము **"అంతిమ దైవగ్రంథమను"** పేరుతో ఇప్పటికే మూడవ గ్రంథము వచ్చినది. అయితే దానిని చెప్పిన వాడు జిబ్రయేల్ అను గ్రహమని మనము చెప్పుకొన్నాము. దేవుని మూడవ అవతారము మనిషి ఆకృతిలోనే ఉండును. కనుక మూడవ గ్రంథమును ఇచ్చిన జిబ్రయేల్ ఖగోళములోని గ్రహమైనందున అతనిని భగవంతుడని అనుటకు వీలులేదు. దానినిబట్టి మూడవ దైవగ్రంథమునకు భగవంతునికి సంబంధము లేదని తెలిసిపోయినది. అందువలన 1400 సంవత్సరముల క్రిందట వచ్చిన తృతీయ దైవగ్రంథమునకు భగవంతునికి సంబంధము లేదు. కావున ఈ పద్నాలుగు వందల సంవత్సరములలో గానీ, లేక రాబోయే కాలములోగానీ, దేవుని మూడవ అవతారము రావలసి యున్నది.

**ప్రశ్న :- అంతిమ దైవగ్రంథము మూడవ గ్రంథముగా వచ్చినది కదా! దానిని భగవంతుడు చెప్పకపోతే దానికి దైవగ్రంథమని పేరు ఎలా వచ్చినది? మూడవ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథమును అంతిమ దైవగ్రంథమని ఎందుకన్నారు?**

**జవాబు :-** రెండుమార్లు భగవంతుడు వచ్చినప్పుడు చెప్పిన జ్ఞానము రెండు దైవగ్రంథములుగా వచ్చినమాట నిజమే. అయినా మూడవ దైవగ్రంథమును చెప్పినవాడు ఖగోళ గ్రహమైనందున, గ్రహమునకు మానవ శరీరము లేనందున మూడవ గ్రంథమును చెప్పిన వ్యక్తి భగవంతుడు కాడని చెప్పవచ్చును. అయితే ఆ గ్రంథమునకు మూడవ దైవగ్రంథమని పేరు వచ్చుటకు మరియొక కారణము గలదు. అదేమనగా! అదే అంతిమ దైవ

గ్రంథమందే 42వ సూరాలో 51వ ఆయత్‌నందు ఇలా కలదు చూడండి. **(42-51) "దేవ్రుడు నేరుగా ఏ మానవ్రునితోనూ మాట్లాడడు. దేవ్రునితో మాట్లాడడము మనిషికి సాధ్యమయ్యే పనికాదు. దేవ్రుడు తన జ్ఞానమును ఆకాశవాణి ద్వారా (వహీ ద్వారా) గానీ లేక తెరవెనుకనుంచి మనిషికి చేరవేస్తాడు లేదా తాను కోరినది తన ఆజ్ఞతో సూచించడానికి తన ప్రతినిధిని పంపుతాడు. ఆయన మహోన్నతుడు. ఎంతో వివేకవంతుడు"** ఇక్కడ చెప్పిన వాక్యమునుబట్టి దేవుడు మనిషికి మూడు విధముల తన జ్ఞానమును తెలియజేయునని తెలియుచున్నది.

దేవుడు తెల్పిన మూడు విధానములలో మొదట ఆకాశవాణి నుండి శబ్దము ద్వారా జ్ఞానము సృష్ట్యాదిలోనే చెప్పబడినది. సృష్ఠి మొదటిలోని మనుషులకు నాగరికత తెలియదు, భాష తెలియదు, మేథాశక్తి లేదు. అందువలన మనిషికి తెలిసిన భాషలో దేవుడు తన జ్ఞానమును చెప్పలేదు. తన జ్ఞానమునకు పునాది వేసినట్లు మొదట జ్ఞానమును చెప్పినా అది ఆకాశములోని గ్రహములకు, భూతములకు, మహాభూతములకు తెలియునట్లు పెద్దపెద్ద శబ్దముల రూపములో తెలియజేయడమైనది. ఆకాశమునుండి వచ్చిన శబ్దములను (ఉరుములను) గ్రహములు, భూతములు గ్రహించగలిగాయి గానీ, మనుషులకు ఆ శబ్దముల అర్థము ఏమిటో తెలియక పోవడము వలన ఆనాటి దైవ భావము ఏమో ఏ మనిషికీ తెలియలేదు. ఆనాడు చెప్పిన జ్ఞానమును ద్వాపర యుగము చివరిలో కృష్ణుడు వివరించి చెప్పడమైనది. **దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే** అయినందున ఆకాశవాణి చెప్పిన జ్ఞానమే ఎక్కడయినా చెప్పబడుతుంది గానీ వేరే జ్ఞానముండదు. మొదట సృష్ట్యాదిలో ఉరుముల

రూపములతో చెప్పిన జ్ఞానము కృష్ణుని ద్వారా ప్రజలకు తెలియబడినది. అదే జ్ఞానమే ప్రథమముగా వ్యాసుని చేత గ్రంథమయినది. కావున దానిని **ప్రథమ దైవగ్రంథమని** చెప్పడమైనది.

సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానమే ప్రపంచమునకంతటికీ అవసరమైన జ్ఞానమగుట వలన ఎవరు చెప్పినా, ఎక్కడ చెప్పినా దానిని చెప్పవలసిందే. ఏసు చేత ప్రథమ దైవగ్రంథములోని జ్ఞానమే చెప్పబడినది. అదే బోధ ఇంజీలుగా (బైబిలుగా) వ్రాయబడినది. దైవజ్ఞానము రెండవ గ్రంథముగా వచ్చినందుకు దానిని **ద్వితీయ దైవగ్రంథము** అని అంటున్నాము. మొదట ఆకాశవాణి చేత చెప్పబడినది మొదట ప్రథమ దైవగ్రంథమయినది, తర్వాత అదే ద్వితీయ దైవగ్రంథమయినది. ప్రథమ దైవగ్రంథములోని జ్ఞానమునే జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్త గారికి చెప్పడము వలన అదే జ్ఞానమే **తృతీయ దైవగ్రంథము**గా వ్రాయబడినది. తృతీయ దైవగ్రంథము ఖుర్ఆన్ అని చెప్పడమైనది.

**ప్రశ్న :- ఖుర్ఆన్‌ను తృతీయ దైవగ్రంథమని అనకుండా అంతిమ దైవగ్రంథమని ముస్లీమ్‌లు అందరూ అనుచుందురు. అలా అనుటకు కారణమేమయినా ఉన్నదా?**

**జవాబు :-** ఈ విషయమును నేను ముస్లీమ్ పెద్దలను అడిగాను. దానికి వారు సమాధానము చెప్పారు. అయితే అది వారి భావనేగానీ, అది శాస్త్రబద్ధమైన జవాబు కాదు. హేతుబద్ధమైన వివరణ కాదు. ఖుర్ఆన్ తర్వాత వేరే దైవగ్రంథము రాదు, రాబోదు. అందువలన ఇదియే అంతిమ దైవగ్రంథమని చెప్పుచున్నామని అన్నారు. ప్రథమ దైవగ్రంథములో **"కాలక్రమమున జ్ఞానము నశించి, ధర్మములు బలహీనమై**

**అధర్మములు చెలరేగినప్పుడు, అజ్ఞానము మనుషులలో నిండి పోయినప్పుడు రాబోయే యుగములలో కూడా ధర్మప్రతిష్టాపనకు వస్తానని"** చెప్పియున్న మాటను మరచిపోకూడదు. మొదట ప్రథమ దైవగ్రంథము తయారయినది. తర్వాత మిగతా రెండు దైవగ్రంథములు తయారయినవి. అయితే ఆ రెండు గ్రంథములు మొదట తయారయిన భగవద్గీత జ్ఞానమును అనుసరించియే యుండునని దేవుడు తన బోధలో చాలామార్లు తెలియజేశాడు. అదే విషయమును గురించి ఖుర్ఆన్ గ్రంథములో కూడా చెప్పిన వాక్యములను వరుసగా చూస్తాము.

**(5-48) "మేము నీ వైపుకు ఈ గ్రంథాన్ని (ఖుర్ఆన్ను) సత్య సమేతముగా అవతరింపజేశాము. ఇది తమకన్నా ముందు వచ్చిన గ్రంథాలను సత్యమని ధృవీకరిస్తుంది. నీవద్దకు వచ్చిన సత్యమును వీడి వారి (మనుషుల) మనోవాంఛలను అను సరించకు."**

**(5-44) "మేము తౌరాత్ గ్రంథమును అవతరింపజేశాము. అందులో మార్గదర్శకము, జ్యోతి ఉన్నాయి. ఈ తౌరాత్ గ్రంథ ఆధారముగానే ముస్లిమ్లైన ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు యూదుల సమస్యలను పరిష్కరించేవారు."**

**(5-68) "ఓ గ్రంథవాహకులారా! తౌరాతును, ఇంజీలును (భగవద్గీత, బైబిలును) మీ ప్రభువు తరపున మీవద్దకు పంపబడిన దానిని (ఖుర్ఆన్ గ్రంథమును) మీ జీవితాలలో నెలకొల్పువరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే."**

**(62-5) "తౌరాతు గ్రంథము ప్రకారము ఆచరించాలని ఆదేశించి**

**నప్పటికీ, దానికి అనుగుణముగా ఆచరించని వారు ఎన్ని గ్రంథములను అనుసరించినా, అటువంటి వారిని ఎన్నో గ్రంథములు వీపుమీద మోయు గాడిదలాంటి వారని ఉపమానముగా చెప్పవచ్చును. దేవుని వాక్యములను ధిక్కరించిన వారి దృష్టాంతము చాలా చెడ్డది. దుర్మార్గపు జనులకు అల్లాహ్ సన్మార్గము చూపడు."**

ఇక్కడ వాక్యములలో చెప్పిన తౌరాత్ గ్రంథమునే ఇప్పుడు మనము భగవద్గీతగా చెప్పుచున్నాము. తౌరాత్‌కు భగవద్గీతకు ఏమి సంబంధమని కొందరు అడుగవచ్చును. దానికి సమాధానము తెలియాలంటే మేము వ్రాసిన **"అంతిమ దైవగ్రంథములోని జ్ఞాన వాక్యములు (రెండవ భాగము)"** అను గ్రంథమును చూడవలెను. అందులో 'తౌరాత్' అంటే ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతయని వివరము గలదు. దేవుని జ్ఞానము ద్వాపర యుగములో భగవద్గీతగా, కలియుగములో బైబిలు, ఖుర్ఆన్‌గా వెలువడినది. ఈ మూడు గ్రంథములలో యున్నది ఒకే దైవజ్ఞానమయిన దానివలన మూడింటిని దైవగ్రంథములని చెప్పడమైనది. తయారయిన వరుస క్రమమును బట్టి ప్రథమ, ద్వితీయ, తృతీయ దైవగ్రంథములుగా చెప్పుచున్నా దేవుడు తన జ్ఞానమును అందించు మూడు విధానములలో చివరిగా అందించినదయినందున దీనిని "అంతిమ దైవగ్రంథము" అని చెప్పవలసి వచ్చినది. దేవుడు ఖుర్ఆన్‌లోనే చెప్పిన ప్రకారము ఒకటి ఆకాశవాణి ద్వారా జ్ఞానమును అందించడము, రెండు తెరచాటునుండి చెప్పడము, మూడు తన ప్రతినిధి ద్వారా జ్ఞానమును తెలుపడము అని చెప్పబడి యుండగా, 'ఆకాశవాణి ద్వారా అందించిన జ్ఞానము' అను విధానము మొదటనే జరిగిపోయినది. అలా చెప్పబడిన జ్ఞానము మొదట గ్రంథముగా

తయారయినది. తర్వాత రెండవ గ్రంథము తయారయినది. మూడవ గ్రంథమయిన ఖుర్‌ఆన్ చివరిలో తయారయినది, కావున దానిని ఎప్పటికీ చివరి గ్రంథమనీ, అంతిమ దైవగ్రంథమని చెప్పడము జరిగినది. తయారయిన వరుసనుబట్టి చెప్పబడడమేకాక దేవుడు చెప్పిన మూడు విధానములలో ఆకాశవాణి ద్వారా చెప్పినది మొదట గడచిపోగా, తన ప్రతినిధియైన మనిషి ద్వారా చెప్పినది రెండవమారు గడచిపోగా, చివరిగా గడచినది తెరచాటునుండి చెప్పినది. చివరిగా తెరచాటునుండి జిబ్రయేల్ గ్రహము చెప్పగా ముహమ్మద్ ప్రవక్త గారు విని దానినే గ్రంథరూపముగా చేయడము వలన అది చివరి దైవగ్రంథమయినది.

దైవప్రతినిధిగా కృష్ణుడు వచ్చి జ్ఞానమును చెప్పాడు అదియే భగవద్గీత. అలాగే దైవప్రతినిధి రెండవమారు వచ్చి దైవజ్ఞానమును చెప్పాడు అదియే సువార్త బైబిలు. అయితే ఖుర్‌ఆన్ విషయములో దైవప్రతినిధి రాలేదు. అందువలన దైవప్రతినిధి తప్పక రావలసియున్నది. దైవ ప్రతినిధియైన భగవంతుడు మూడుమార్లు భూమిమీదికి వస్తే అప్పుడు దైవ అవతారము ఒక్కమారు పూర్తి అయినట్లుగును. దైవప్రతినిధులుగా ఒకమారు కృష్ణుడు, రెండవమారు ఏసు వచ్చారని తెలియుచున్నది. ఇకపోతే మూడవ దైవప్రతినిధిగా శరీరము ధరించి వచ్చువాడు 'ఆదరణకర్తయని' కొంతవరకు తెలిసినది. మొదటి ప్రతినిధియైన కృష్ణభగవాన్ చనిపోవునప్పుడు తన రెండవ జన్మ ఏసుగా వస్తానని చెప్పాడు. అట్లే ఏసు తాత్కాలిక మరణమును పొందు సమయముకంటే ముందు తన శిష్యులతో కలిసిన చివరి కలయికలో తాను తర్వాత జన్మలో ఆదరణకర్తగా వస్తానని చెప్పాడు. ఈ విధముగా మొదటి జన్మ తర్వాత మిగతా రెండు జన్మలు కొంత సూచాయగా చెప్పబడినవి. మొదటి దైవప్రతినిధియైన కృష్ణభగవాన్ ద్వారా

రెండవ రాక ఏసుగా వస్తాడని తెలిసినది. రెండవ ప్రతినిధి ద్వారా మూడవ రాక ఆదరణకర్తగా వస్తాడని తెలిసినది. ఆదరణకర్త వస్తే ఒకమారు దేవుని అవతరణ పూర్తి అయినట్లే యగును.

భూమిమీద పూర్తి ధర్మసంస్థాపణ జరుగవలెనంటే, అధర్మములు లేకుండా పోవాలంటే దేవుడు ఒకమారు అవతరించాలి. దేవుని అవతారము పూర్తి అగుటకు భగవంతుడు మూడుమార్లు పుట్టాలి. మూడుమార్లు భగవంతుడు భూమిమీదికి వస్తే అప్పుడు దేవుడు ఒకమారు అవతరించి నట్లగును. అప్పుడు కొద్దికొద్దిగా అధర్మములు అణిగిపోవుటకు మొదలు పెట్టును. అధర్మములు అణగిపోవు కొలది ధర్మముల వృద్ధి జరుగుచు వచ్చును. ఈ విధముగా కొంతకాలమునకు అధర్మములు పూర్తిగా రూపు మాసిపోయి, ధర్మప్రతిష్ఠాపన పూర్తిగా జరుగును. ఇదంతయూ ఎవరికీ తెలియకుండానే జరుగును. దేవుడు ప్రత్యక్షముగా కనిపించి ధర్మములను ప్రతిష్ఠించునది ఏమీ లేదుగానీ, వాటంతట అవే జరిగిపోయినట్లు తెలియును. దేవుని అవతరణ ముగ్గురు భగవంతులుగా వచ్చినప్పుడు పూర్తియగును. అప్పుడు మూడు అవతారములలో ధర్మములను బోధించడము జరుగును. చివరి జన్మలో భగవంతుని బోధలు ఎక్కువగా యుండును. అందువలన చివరి అవతరణ అనగా మూడవ అవతరణ జరిగిన తర్వాత ధర్మప్రతిష్ఠాపన, అధర్మముల నిర్మూలన ఎక్కువగా కనిపించును.

ఇప్పుడు రెండుమార్లు భగవంతుడు భూమిమీదకు వచ్చిపోయాడు. ఒకమారు కృష్ణునిగా రాగా, రెండవమారు ఏసుగా వచ్చాడు. వచ్చినవాడు ఒక్కడే అయినా ఇద్దరిగా వేరువేరు జన్మలుగా, పోలికలు లేని జన్మలుగా కనిపించుట వలన ఇద్దరూ ఒక్కరేనని ఎవరూ గుర్తించలేదు. అందువలన కృష్ణుని జన్మ, ఏసు జన్మ రెండు తూర్పు పడమరగా యున్నవి. ఎంత

మేధాశక్తి గల వారైనా వారిద్దరూ ఒక్కటేయని గుర్తించలేరు. రాబోవు జన్మ కూడా ఈ రెండు జన్మలతో సంబంధము లేనట్లుండును. మూడవ జన్మగా దేవుడు ఎప్పుడు వచ్చినా ఏమాత్రమ గుర్తించలేనిదిగా ఉండును. ఇది భగవంతుని జన్మయని ఎవరూ గుర్తించలేరు. అయితే ఈ మారు భగవంతుని జన్మ జరిగితే సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునే అనేకముగా వివరించి చెప్పును. మూడవమారు వచ్చిన భగవంతుడు గతములో రెండుమార్లు చెప్పిన జ్ఞానముకంటే ఎక్కువ వివరణ గల జ్ఞానమును బోధించును. ఇప్పటికి రెండుమార్లు భగవంతుడు వచ్చిపోవడము జరిగినది. అయినా అధర్మములు కదలకుండాయున్నవి. సంపూర్ణముగా అధర్మములను నిర్మూలించుటకు దేవుడు తప్పక రావలసియున్నది. అందువలన **దేవుని రాకకు ఇది సమయము కాదా?** యని నేను అంటున్నాను.

జిబ్రయేల్ గ్రహము తెరచాటునుండి దేవుడు సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునే ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పినా, చెప్పినది చివరి గ్రంథమయినా తర్వాత జ్ఞానము ఇక రాదు, ఇదే చివరి జ్ఞానము అని చెప్పుటకు వీలులేదు. మూడు దైవగ్రంథములు భూమిమీదనే యున్నా ఇక్కడే అజ్ఞానము, అధర్మములు మితిమీరి యున్నవి. వాటి నిర్మూలనకు మూడవమారు దేవుడు భగవంతునిగా వస్తే గతములో చెప్పిన జ్ఞానముకంటే ఎక్కువ వివరముగా జ్ఞానము తెలియజేయబడునని చెప్పాడు. అందువలన అంతిమ దైవగ్రంథము తర్వాత కూడా విశేషమైన జ్ఞానము, విజ్ఞానదాయకమైన జ్ఞానము, జ్ఞానమార్గములో ప్రతి విషయమునకు మెరుగైన వివరణగల జ్ఞానము లభించును. అయితే వాటికి 'దైవగ్రంథము' అనే పేరుండదు. మూడవ భగవంతున్ని కనుగొనుటకు వీలులేకుండా చివరి దైవగ్రంథమును ముందే భూమిమీదికి వచ్చునట్లు దేవుడు చేశాడు. అంతటితో దేవున్ని

తెలుపు జ్ఞాన విధానములు మూడు అయిపోవుట వలన తర్వాత దైవజ్ఞాన గ్రంథములు ఏవి వచ్చినా, ఎన్ని వచ్చినా వాటికి 'దైవగ్రంథము' అను వరుస క్రమముండదు. ఇటువంటి విధానముండుట వలన మూడవమారు వచ్చు భగవంతున్ని ఎవరూ గుర్తించలేరు. ఎప్పుడు భగవంతుడు వచ్చినా సృష్ట్యాదిలోని జ్ఞానమునే బోధించునని గుర్తుంచుకోవలెను.

**ప్రశ్న :- ప్రప్రథమముగా సృష్ట్యాదిలో వచ్చిన జ్ఞానమును సూర్యుడు భూమిమీద గల మనువుకు తెలిపాడని, మీరే చెప్పగా విన్నాము. మిగతా వారు కూడా అదే చెప్పుచున్నారు. అయితే జిబ్రయేల్ అనునతడు 1400 సంవత్సరముల పూర్వము ముహమ్మద్ ప్రవక్తగారికి ఖురాన్‌ను హీరా గుహలలో చెప్పాడు అని విన్నాము. అందరి భావములో జిబ్రయేల్ ఒక దేవదూతయని కలదు. అయితే అతను దేవదూత కాదు అని ఖురాన్ గ్రంథములోనే (2-97), (2-98), (26-193), (70-4), (78-38), (97-4) ఆయత్‌లలో గలదు. మీరేమో జిబ్రయేల్ మహాజ్ఞాని అని చెప్పారు. అంతేకాక కొన్నిచోట్ల సృష్ట్యాదిలో ఆకాశవాణి సూర్యునికి చెప్పిన జ్ఞానమును సూర్యుని ద్వారా జిబ్రయేల్ విన్నాడని ఒకచోట చెప్పారు. మరియొక చోట సూర్యునికి ఆకాశవాణి చెప్పునప్పుడే జిబ్రయేల్ కూడా విన్నాడని చెప్పారు. మీరు జిబ్రయేల్ విషయములో రెండు రకములుగా చెప్పగా మేము ఆ విషయమును గురించి ప్రశ్నించి అడిగాము. జిబ్రయేల్ సృష్ట్యాదిలోని జ్ఞానమును ఆకాశవాణి చెప్పునప్పుడే సూర్యునితోపాటు విన్నాడా లేక తర్వాత సూర్యుని ద్వారా విన్నాడాయని అడిగాము. అప్పుడు తర్వాత సత్యమునే చెప్పెదమని చెప్పారుగానీ ఇంతవరకు అక్కడున్న సత్యమేమిటో మీరు వివరించి చెప్పలేదు. అందువలన మేము ఇప్పుడు జిబ్రయేల్‌కు దైవజ్ఞానము**

**ఎలా తెలిసింది, ఎప్పుడు తెలిసింది? జిబ్రయేల్ మహాజ్ఞాని ఎలా అయ్యాడు? అని అడుగుచున్నాము.**

**జవాబు :-** కొన్ని విషయాలను వెంటనే చెప్పకూడదు. ఎదుటి మనిషి సత్యమును గ్రహించుకొను స్థోమత కల్గినప్పుడే చెప్పవలసియుండును. అందువలన కొన్ని విషయములను అనుకూలమున్నప్పుడు, అవకాశమును బట్టి, సమయ సందర్భమును బట్టి చెప్పుచుందుము. జిబ్రయేల్ సృష్ట్యాదిలో ఆకాశవాణి చెప్పిన జ్ఞానమునే ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పాడు. అయితే సృష్ట్యాదిలోని జ్ఞానము సూర్యుని తర్వాత జిబ్రయేల్‌కు మాత్రము తెలుసు అని చెప్పుకొన్నాము. సూర్యుడు కృతయుగములో మొదట మనువుకు చెప్పిన జ్ఞానమునే, కలియుగములో జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పడమైనది. అయితే సూర్యుడు ఖగోళములో ఒక గ్రహముకాగా, జిబ్రయేల్ కూడా సూర్యునివలె ఖగోళములో ఒక గ్రహముగా యున్నాడు. సూర్యుడు విన్నప్పుడే జిబ్రయేల్ కూడా విన్నాడు. ఇక్కడ బాగా గమనించితే దేవుడు ఆకాశవాణి ద్వారా సూర్యునికి జ్ఞానము చెప్పానని చెప్పాడు గానీ, అక్కడ జిబ్రయేల్‌కు కూడా చెప్పానని చెప్పలేదు కదా! అటువంటప్పుడు సూర్యుడు ఒక్కడే వినియుండవచ్చును గానీ జిబ్రయేల్ వినుటకు అవకాశము లేదు కదా! అటువంటప్పుడు జిబ్రయేల్ విన్నాడు అనుమాట అసత్యము కదా!యని కొందరడుగవచ్చును. దానికి నా జవాబు ఏమనగా!

సూర్యుడు ఒక్కడే విన్నమాట వాస్తవమే. అట్లని జిబ్రయేల్ కూడా అప్పుడే విన్నాడు అనుమాట కూడా వాస్తవమే. ఒక్కడే అనుమాట వాస్తవ మయితే సూర్యుడు, జిబ్రయేల్ అనువారు ఇద్దరు కాదు ఒక్కరేయని సులభముగా తెలియవచ్చును. భారతదేశములో ఎవరినయితే **దేవుడు** అని అంటున్నామో అతనినే అరబ్ దేశములో **అల్లాహ్** అని అంటున్నారు.

అంతమాత్రమున అల్లాహ్, దేవుడు ఇద్దరు వేరువేరని చెప్పలేము కదా! దేవుడు అనినా, అల్లాహ్ అనినా ఇద్దరు ఒక్కరేనని చెప్పినట్లు, భారత దేశములో సూర్యుడని ఎవరిని అంటున్నామో అతనినే అరబ్ దేశములో జిబ్రయేల్ అంటున్నాము. అందువలన ఇద్దరూ ఒక్కరేనని చెప్పవచ్చును. మేము మొదటినుండి జిబ్రయేల్ ఖగోళములోని ఒక గ్రహమని చెప్పుచూ వచ్చుచున్నాము. సూర్యుడు గ్రహమే, జిబ్రయేల్ గ్రహమే. ఆకాశవాణి బోధను ఒక్కరే విన్నారు ఆ ఒక్కరినే సూర్యుడని ఒకమారు చెప్పగా, మరొక మారు జిబ్రయేల్ అని చెప్పాము. సూర్యుడు అను పేరు జిబ్రయేల్ అను పేరు రెండు ఒక్కటేయని తెలిసినప్పుడు అన్ని ప్రశ్నలకు జవాబు దొరికి పోవును. జిబ్రయేల్ పేరుతో ముహమ్మద్ ప్రవక్తకు జ్ఞానమును చెప్పిన వాడే సూర్యుడను పేరుతో మనువుకు జ్ఞానమును చెప్పాడు. కృత యుగములో మనువుకు సూర్యుడను పేరుతో చెప్పిన గ్రహమే కలి యుగములో జిబ్రయేల్ అను పేరుకలిగి ముహమ్మద్ ప్రవక్తగారికి జ్ఞానమును చెప్పడమైనది.

సృష్ట్యాదిలోని జ్ఞానమునే సూర్యుడు చెప్పుట వలన, అదే జ్ఞానమునే కృష్ణుడు వ్యాసుని ద్వారా **ప్రథమ దైవగ్రంథము భగవద్గీత**గా వ్రాయించాడు. సృష్ట్యాదిలోని జ్ఞానమునే జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తకు చెప్పుట వలన, ప్రవక్త ద్వారా **అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్** బయటికి వచ్చినది. దీనినిబట్టి ప్రథమ దైవ గ్రంథములో యున్న జ్ఞానమే అంతిమ దైవగ్రంథములో గలదు. భారత దేశమున సూర్యుడని పేరుపెట్టి పిలిచిన వానిని అరబ్ దేశములో జిబ్రయేల్ అని ఎలా పిలిచారో, అలాగే భారతదేశమున చెప్పబడిన జ్ఞానమును **భగవద్గీత**యను పేరుతో పిలిచిన గ్రంథమును అరబ్ దేశములో **తౌరాత్** గ్రంథమని పేరుపెట్టి పిలుచుచున్నారు. ఈ విషయము ప్రవక్తగారికి

ముందే తెలుసు, కావున ఆయన చెప్పిన ఆయత్‌లలో తౌరాత్‌లోనున్న జ్ఞానమే ఖురాన్ గ్రంథములో కలదని చెప్పాడు. అదే విషయమును చెప్పుచూ సూరా 5, ఆయత్ 48లో ఇలా చెప్పడమైనదని జ్ఞాపకము చేయుచున్నాము.

**(5-48) "మేము నీ వైపుకు పంపిన ఈ గ్రంథమును ఖురాన్‌ను సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తమకన్నా ముందు వచ్చిన గ్రంథాలను (తౌరాత్‌ను) సత్యమని ధృవీకరించుచున్నది."**

**(5-44) "మేము తౌరాత్ గ్రంథమును అవతరింపచేశాము. అందులో మార్గదర్శకము, జ్యోతి ఉన్నాయి. ఈ తౌరాత్ గ్రంథ ఆధారముగానే ముస్లీమ్‌లైన ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు యూదుల సమస్యలను పరిష్కరించెడివారు."**

ప్రశ్న :- మూడవ దైవగ్రంథమే అంతిమ దైవగ్రంథముగా పిలువబడుట వలన ఆ పేరు ఎందుకు వచ్చిందని తెలియని ముస్లీమ్‌లు "జ్ఞానములో చివరి గ్రంథము ఇదే దీని తర్వాత జ్ఞాన గ్రంథమే రాదు" అంటున్నారు. అయితే అంతిమ దైవగ్రంథము తర్వాత చివరిగా అనగా దేవుని అంతిమ అవతారముగా మూడవ భగవంతుడు రావలసియున్నది. మూడవమారు భగవంతుడు వస్తే ముందుకంటే ఎక్కువ జ్ఞానమును బోధించును అని చెప్పారు. అట్లు చెప్పితే ఇక్కడ ముస్లీమ్‌లు చెప్పిన మాటకు వ్యతిరేఖముగా చెప్పినట్లగును కదా!

**జవాబు :-** దేవుడు సంపూర్ణ జ్ఞానమును తన మూడవ అవతారములో చెప్పుట సత్యమే. ఎందుకనగా! తన చివరి అవతారము చివరి బోధతోనే భూమిమీదగల అజ్ఞానమంతయూ అంతమైపోవలసియున్నది. ముస్లీమ్‌లు సాధారణ మనుషులు మాత్రమే వారికి తమ గ్రంథముగా చెప్పుకొను

ఖుర్ఆన్‌లోని విషయములే సరిగా తెలియవు. 'ఖురాన్ గ్రంథము మాది' అని చెప్పడములోనే వారికి ఆ గ్రంథమును గురించి సరిగా తెలియలేదని చెప్పవచ్చును. ఖుర్ఆన్ గ్రంథము 'సర్వమానవాళికి' సంబంధించిన గ్రంథముగా ఉండగా 'అది మా గ్రంథము' అనడములో అర్థమే లేదు. **భగవద్గీత హిందువుల గ్రంథము కాదు. బైబిలు క్రైస్తవుల గ్రంథము కాదు. ఖుర్ఆన్ ముస్లీమ్‌ల గ్రంథము కాదు.** మూడు గ్రంథముల పేర్లు వేరయినా ఆ మూడు గ్రంథములు ఒకే దేవుని జ్ఞానమునకు సంబంధించినవి. సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే ఆ మూడు గ్రంథములలో గలదు. ప్రథమ గ్రంథముగా చెప్పబడిన భగవద్గీతకు సంబంధించిన జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో గలదు. మూడు గ్రంథములు ఒకదానితో మరొకటి అవినాభావ సంబంధము కల్గియున్నవి. అటువంటప్పుడు ఖుర్ఆన్ గ్రంథమే అందరికీ అవసరమని చెప్పడము తప్పగును. ఖురాన్ గ్రంథములో 62 వ సూరా, 5వ ఆయత్‌లో **(62-5) "తౌరాత్ గ్రంథము ప్రకారము ఆచరించాలని ఆదేశించినప్పటికీ, దానికి అనుగుణముగా ఆచరించనివారు ఎన్ని గ్రంథములను అనుసరించినా అటువంటి వారిని ఎన్నో గ్రంథములను వీపు మీద మోయు గాడిదలాంటి వారని ఉపమానముగా చెప్పవచ్చును"** అని చెప్పిన ప్రవక్త మాటను మరచిపోకూడదు. ఇలా జిబ్రయేల్ చెప్పిన మాటను ప్రవక్తగారు చెప్పియుండగా ఈ మాటను అతిక్రమించి చివరిగా వచ్చిన ఖుర్ఆన్ గ్రంథమే గొప్ప అనడము అజ్ఞానమగునని చెప్పవచ్చును. ఇలా ముస్లీమ్‌లు చెప్పుచున్నారనినా, క్రైస్థవులు తమ బైబిలు జ్ఞానమే గొప్పయని చెప్పినా, భగవద్గీత మిగతా రెండు గ్రంథములతో సంబంధము పడియున్నదని హిందువులు తెలియకపోయినా వారికి దేవుడు చెప్పిన జ్ఞానము అర్థము కాలేదనియే చెప్పవచ్చును.

మూడు దైవగ్రంథములను వేరువేరుగా భావించి, ఒక్క గ్రంథమును మాత్రము పొగడుచూ మిగతా రెండు గ్రంథములను చూడనివాడు, చదువనివాడు పూర్తి అజ్ఞానములో యున్నట్లే లెక్కించబడును. భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్‌ను ఎవడయితే అసూయతో చూడకుండా గౌరవముగా చూచునో, ఎవడయితే మూడు గ్రంథములను చదివి మూడు గ్రంథములలోని విషయములను గ్రహించునో వానిని మూడు గ్రంథముల జ్ఞానియని చెప్పవచ్చును. అట్లే మూడు మతములలోనూ జ్ఞానియైన వాడని చెప్ప వచ్చును. అట్లు కాకుండా ఎవడయితే తనది ఒక గ్రంథమేనని, మిగతా రెండు గ్రంథములు అన్యమతములవని అసూయతో చూచునో వానిని అజ్ఞాని అని అనడమే కాక ఖురాన్ గ్రంథములో 5వ సూరా, 68వ ఆయత్‌లో అటువంటి వారిని గురించి ఏమి వ్రాశారో చూడండి. **(5-68) "తౌరాతును (భగవద్గీతను) ఇంజీలును (బైబిలును) మీ ప్రభువు తరుపున మీ వద్దకు పంపబడిన ఖుర్ఆన్ గ్రంథమును మీ జీవితములలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మము పైనా లేనట్లే"** అని చెప్పబడి యున్నది. దేవుడు (అల్లాహ్) ఇలా చెప్పియున్నాడని తెలిసిన ఎవడు ఇతర దైవగ్రంథములను గురించి అసూయగా మాట్లాడడు.

ప్రశ్న :- **నేటి కాలములో దైవము ఎడల మిగతా అందరికంటే ముస్లీమ్‌లే ఎక్కువ భక్తికల్గి యున్నారని, ఎక్కువగా అల్లాహ్ ఎడల ప్రార్థన (నమాజ్) చేయుచున్నారని విన్నాము. అయితే వారే ఎక్కువగా తమ గ్రంథము గొప్పదని, తమ గ్రంథముతో సమానమైనది లేదని చెప్పుచున్నారు. వారు ఖుర్ఆన్ గ్రంథమును చదివి ఆ మాటను అంటున్నారా? చదవకనే తెలియక ఆ మాటను అన్నారా?**

**జవాబు :-** ముస్లీమ్‌లలో కొందరు మాత్రము ఖుర్ఆన్‌ను చదివిన వారు

గలరు. మిగతావారు చదువలేదనియే చెప్పవచ్చును. ఖురాన్ అరబ్బీ భాషలో ఉండుట వలన చదివిన వారిలో కూడా అరబ్బీ భాష వచ్చినవారికే అది అర్థమయినదని చెప్పవచ్చును. అరబ్బీ భాష రానివారు చదివినా అది అర్థము కాదు. ముస్లీమ్‌లు అరబ్బీ భాషలోనే చదువవలెనను నియమము ఉండుట వలన ముస్లీమ్‌లలో కొందరు మాత్రమే చదువగలిగినారు. చదివినవారు బోధకులుగా తయారయి వారు ఏమి చెప్పితే మిగతా ముస్లీమ్‌లు అదే వింటున్నారు. అరబ్బీ భాషలో చదివిన వారు నూటికి ఇద్దరు లేక ముగ్గురున్నారని చెప్పినా ఎక్కువే! ఒకవేళ వారు చదివినా చదివినవన్నీ అర్థమయినాయను నమ్మకము లేదు. భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములను మూడింటిని పరిశీలించి చూచిన భగవద్గీతకంటే, బైబిలుకంటే ఎక్కువ సూక్ష్మ భావముతో కూడుకొన్న వాక్యములు ఖురాన్‌లో గలవు. ఖురాన్ గ్రంథములో కూడా మూడవ సూరా, ఏడవ ఆయత్‌లో ఖురాన్ గ్రంథము స్థూల, సూక్ష్మ భావములతో కూడుకొనియున్నదని చెప్పడమైనది. స్థూల అర్థమునిచ్చువాటిని **"ముహ్కమాత్"** వాక్యములని, సూక్ష్మ అర్థముతో కూడుకొన్న వాటిని **"ముతషాబిహాత్"** వాక్యములంటారు. స్థూల అర్థముతో కూడుకొన్న వాక్యములు ఖురాన్ గ్రంథమునకు మూలము లని అదే వాక్యములో చెప్పారు. ఒక ఇంటికి మూలములున్నట్లే ఖురాన్ గ్రంథమునకు మూలాధారమైన వాక్యములున్నాయని చెప్పడమైనది. ఇంటికి మూలాధారమైనవి పునాదులు లేక గుణాదులు అని అంటారు. ఇంటి భారమునంతటినీ మోయు వాటిని ఇంటి పునాదులు లేక మూలములు అని అంటారు. ఇంటి పునాదులు ఇంటిలో ఐదవ వంతు ఉంటాయి. మిగతా నాలుగు వంతుల ఇల్లు, ఒక వంతు పునాదుల మీద నిర్మింపబడి యుంటుంది. అలాగే ఖురాన్ గ్రంథములో ఒకవంతు గ్రంథమూల ములయిన వాక్యములుండగా, నాలుగువంతులు పై గోడలులాంటి

వాక్యములున్నవి. దీనినిబట్టి ఖురాన్ గ్రంథములో ఒకవంతు స్థూల అర్థమునిచ్చు వాక్యములుండగా, నాలుగు వంతులు సూక్ష్మమైన అర్థముతో కూడుకొన్న వాక్యములు గలవని తెలియుచున్నది. అయితే ముస్లీమ్‌లు తమ గ్రంథములో సూక్ష్మమైన అర్థముగలవి లేవని, కొందరు పని గట్టుకొని సూక్ష్మ అర్థము చెప్పుచుందురని అంటున్నారు. అలా సూక్ష్మ అర్థములను చెప్పి ముస్లీమ్‌లను తప్పుదారి పట్టించుచున్నారని, అటువంటి వారి మాటలు వినకూడదని చెప్పుచున్నారు. అల్లాహ్ ఒకవైపు తన ఆయత్‌లో గ్రంథమందు స్థూల, సూక్ష్మ రెండు రకముల వాక్యములున్నవని చెప్పుచుండగా, మా గ్రంథములో సూక్ష్మ అర్థముగల వాక్యములే లేవు అన్నట్లు మాట్లాడుచున్నారు. సూరా 3, ఆయత్ 7లో దేవుడు ఏమి చెప్పాడో, మనుషులు ఏమి వ్రాశారో ఒకమారు చూడండి. **(3-7) "నీ పైన ఈ గ్రంథమును అవతరింప జేసినవాడు దేవుడే. ఇందులో స్పష్టమైన స్థూల వాక్యములు (ముహ్కమాత్ విషయములు) గలవు. అవి గ్రంథానికి మూలము. మరికొన్ని బహు విధ భావములతో కూడుకొన్న సూక్ష్మ విషయములు (ముతషాబిహాత్ విషయములు) ఉన్నాయి. హృదయములో వక్రత యున్నవారు ఇందులోని సూక్ష్మ వచనముల వెంటపడి ప్రజలను తప్పుదారి పట్టించుటకు ప్రయత్నిస్తారు. తమ ఉద్దేశ్యములకు సరిపడునట్లు అర్థములను చెప్పుతారు. నిజానికి సూక్ష్మవచనముల వాస్తవ అర్థము అల్లాహ్‌కు తప్ప (దేవునికి తప్ప) మరెవరికీ తెలియదు. అయితే జ్ఞానములో పరిపక్వత చెందినవారు మేము వీటిని నమ్ముచున్నామని, ఇవన్నియూ దేవునివద్దనుండి వచ్చిన వాక్యములే అంటారు.**

**బుద్ధి శ్రద్ధ యున్నవారు మాత్రమే దేవుని జ్ఞానమును గ్రహించ గలుగుతారు"** అని వ్రాయుట వలన ముస్లీమ్‌లు ఖురాన్ గ్రంథములోని అన్ని వాక్యములకు స్థూలముగనే అర్థమును చెప్పుచున్నారు తప్ప సూక్ష్మముగా ఒక్క ఆయత్‌కు కూడా అర్థము చెప్పుకోవడములేదు. ఎవరయినా తెలిసినవారు చెప్పినా వారిని వక్రబుద్ధి యున్నవారనీ, వారి హృదయములలో తప్పు భావములున్నవని చెప్పుచున్నారు.

ఖురాన్ గ్రంథములోని వాక్యములు వేమనయోగి పద్యములాగ ఉండును. వేమనయోగి పద్యముకు స్థూలముగానైనా వివరమును చెప్పవచ్చును లేక సూక్ష్మముగానయినా జవాబు చెప్పవచ్చును. ఇక్కడ ద్వంద్వ అర్థములు గల వేమన పద్యమును చూస్తాము.

కుక్కను తిన్నవాడు గురులింగ జంగడు
పందిని తిన్నవాడు పరమ యోగి
ఏనుగును తిన్నవాడు ఎంత సుజ్ఞానో
విశ్వదాభిరామ వినుర వేమ.

వేమనయోగి పద్యములుగల **"నిగూఢ తత్త్వార్థ బోధిని"** అను మా రచనలలోని గ్రంథమునకు మేము వివరమును వ్రాశాము. ఈ పద్యము పైకి చూచుటకు సూక్ష్మమైన అర్థముతో కూడుకొన్నట్లు కనిపించదు. ఇందులో సూక్ష్మ భావమున్నట్లు కనిపించదు. కుక్క, పంది, ఏనుగును తిన్నవారు వరుసగా గురువు, యోగి, జ్ఞాని అని చెప్పబడినది. అయితే వాటిని తినేవారు భూమిమీద యున్నవారు గురువుగా, యోగిగా, జ్ఞానిగాలేరు. నీచమైన స్వభావములతో నిండుకొనియున్నారు. అటువంటప్పుడు స్థూలమైన భావములో సత్యము లేదని తేలిపోవుచున్నది. అప్పుడు సూక్ష్మ భావము

సరిపోవునేమో చూడవలసి వచ్చినది. ఈ పద్యమునకు మేము వ్రాసిన సూక్ష్మ వివరమును క్రింద చూడండి.

**భావము :-** మన శరీరములో మనస్సు కుక్కవలె అతి చంచలమైనది. ఒక్కక్షణము కూడా స్థిరముగా ఉండక కుక్క ఇల్లిల్లూ తిరిగినట్లు మనస్సు కూడా విషయముల మీదికి చలించుచుండును. కుక్కమాదిరి చంచలమైన మనస్సును ఎవడు జయించునో వాడు నిజముగా గురువుతో సమానమే. గురువు మనస్సు జయించి ఉన్నవాడను విషయమును **కుక్కను తిన్నవాడు గురులింగడని** పై పద్యములో చెప్పారు.

మనస్సు చంచలమైనదియేకాక పరమ నీచమైన విషయముల మీదికి కూడా పోవుచుండును. అందువలన దీనిని పందితో సమానముగా పోల్చి దానిని జయించినవాడు పరమయోగి అని తెల్పుచు **పందిని తిన్నవాడు పరమయోగి** అని వర్ణించారు.

మనస్సు చంచలమైనది, నీచమైనదియే కాక దృఢమైనది, బలమైనదిగా కూడా ఉన్నది. దానిని జయించవలయునని ప్రయత్నము చేసిన వారికి సులభముగా లొంగదు. ఎంత బలముగా మనస్సును నిలుపవలయునని ప్రయత్నము చేసినా అది బలమైనది కనుక పోవుచునే ఉండును. ప్రయత్నమను పగ్గములకు నిలబడక మనలను సులభముగా లాగుకొని పోవు మనస్సు బలమైనదిగా వర్ణించుచు దానిని ఏనుగుగా పోల్చి చెప్పినారు. అటువంటి బలమైన మనస్సును జయించినవాడు సుజ్ఞాని అని చెప్పుచూ **ఏనుగును తిన్నవాడు ఎంత సుజ్ఞానో** అని అన్నారు.

మనస్సు చంచలమైనది కనుక కుక్కగను, నీచమైనది కనుక పందిగను, బలమైనది కనుక ఏనుగుగా వర్ణించి దీనిని జయించుటను తిని లేకుండా చేయడమని వివరించి చెప్పినారు.

సూక్ష్మమైన భావము ప్రకారము సరియైన సమాధానము దొరికింది. అలా సూక్ష్మమైన అర్థమును ఇక్కడ చెప్పుకోకపోతే పద్యమును వ్రాసిన వేమన కూడా బాధపడేవాడేమో! స్థూలముగా అర్థము చెప్పితే అది సత్యదూరముగా యున్నది. సూక్ష్మముగా అర్థము చెప్పినప్పుడు సత్యముగా కనిపించుచున్నది. ఖురాన్‌లో దేవుని వాక్యములకు కూడా స్థూలముగా చెప్పితే ఏమాత్రము భావము సరిపోదు, సత్యముగా ఉండదు. సత్యమును తెలియాలంటే కొన్ని వాక్యములకు సూక్ష్మముగానే అర్థము చెప్పవలసి యుంటుంది. 'సూక్ష్మమైన అర్థము దేవునికే తెలుసు' అనుమాటను అడ్డము పెట్టుకొని వాక్యమును సూక్ష్మముగా చూడకుండా, స్థూలముగా చెప్పు కొనుటకు అలవాటు పడినారు. వారికి మేము చెప్పునది ఏమనగా! ప్రతి మనిషిలోను సత్యమును పలికించువాడు, అసత్యమును పలికించువాడు దేవుడే. **'దేవుని మీద విశ్వాసముండి నన్ను నడిపించువాడు, నన్ను పలికించువాడు దేవుడే' యను భావమున్న వానినుండి సత్యమైన సూక్ష్మ అర్థములనే చెప్పించును.**

ఉదాహరణకు ఖుర్ఆన్ గ్రంథములో 29వ సూరా, 44వ ఆయత్‌ను తీసుకొని చూస్తాము. **(29-44) "అల్లాహ్ ఆకాశాలను, భూమిని సత్యబద్ధముగా సృష్టించాడు. ఆకాశాలను, భూమిని పరమార్థము తో సృష్టించాడని తెలిసితే ఇందులో గొప్ప నిదర్శనము దొరుకు తుంది"** అని కలదు. ఇక్కడ 'భూమిని ఆకాశమును' అని చెప్పియుంటే పైకి కనిపించు ఆకాశ భూమిని సృష్టించాడని, సులభముగా చెప్పవచ్చును. అయితే అట్లు కాకుండా **'ఆకాశములను'** అని బహువచనములో చెప్పి యుండడము వలన మరియు పరమార్థముతో సృష్టించాడని చెప్పి యుండడము వలన, ఇది స్థూల వాక్యము కాదని సూక్ష్మవాక్యమని కొంత

యోచించవలసిన అవసరమున్నది. ఆకాశము ఒక్కటే యుండగా 'ఆకాశములు' అని ఎందుకు చెప్పాడు? ఆకాశములు ఎన్ని ఉన్నాయని యోచిస్తే సూరా 2, ఆయత్ 29లో ఇలా కలదు. **(2-29) "దేవృడు మీకోసము భూమిలో యున్న సమస్త వస్తువులను సృష్టించాడు. తర్వాత ఆకాశము వైపుకు ధ్యానమును మరల్చి తగు రీతిలో సప్తాకాశములను నిర్మించాడు, ఆయన అన్నీ తెలిసినవాడు"** అని కలదు.

(29-44) వాక్యములో ఆకాశములెన్ని? అని వచ్చిన ప్రశ్నకు ఏడు ఆకాశములని జవాబు (2-29)వ వాక్యములో దొరికింది. ఏడు ఆకాశములు బయట ఎక్కడ వెదికినా లేవు, కనిపించవు, లెక్క తేలవు. అందువలన ఈ వాక్యమును స్థూలముగా చెప్పుకోకూడదు అని నిర్ణయించు కోవచ్చును. అయితే ముస్లీమ్‌లందరూ ఈ వాక్యముకు స్థూలముగానే అర్థమును చెప్పుచున్నారు. ఈ వాక్యమునకు స్థూలముగా అర్థము చెప్పితే వేమన పద్యములో కుక్కను, పందిని, ఏనుగును తిన్నవాడు గురువు, యోగి, జ్ఞాని అని చెప్పినట్లుండును. అట్లు కాకుండా దేవుడు చెప్పిన నిజ భావముతో చూడాలంటే, పరమార్థముతో చూడాలంటే ఈ వాక్యములకు సూక్ష్మమైన అర్థమును చెప్పుకోక తప్పదు. అట్లు చెప్పకోక దీని అర్థము దేవునికే తెలుసు అని అంటే దేవుడు ఎవరితోనూ మాట్లాడడు, అందువలన ఆ విషయమును నీకు చెప్పడు. సూరా 2, ఆయత్ 186ను తీసుకొని చూస్తే **(2-186) "నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే, నేను వారికి అతి సమీపములో ఉన్నాను. పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపును విని జవాబిస్తాను. కాబట్టి**

**వారు సరైన మార్గము పొందటానికి నా ఆజ్ఞను అనుసరించాలి మరియు నాయందు విశ్వాసము కలిగియుండాలి అని చెప్పు"** అని కలదు. ఇక్కడ ఈ మాటప్రకారము మనుషులు సరైన మార్గము పొందడానికి అనగా దైవజ్ఞానమును తెలియడానికి, తెలియాలను శ్రద్ధతో నన్ను పిలిస్తే నేను అతని పిలుపును విని ఏది నిజమైన జ్ఞానమో తెలుపుచూ జవాబిస్తాను. అప్పుడు నా ఆజ్ఞను వారు తప్పక అనుసరించాలి అని చెప్పాడు. అందువలన ఎక్కడయినా ఖురాన్‌లోని వాక్యమునకు స్థూల అర్థము సరిపోకపోతే, సూక్ష్మ అర్థము కొరకు దేవున్ని అడిగితే **వానిలోనే వానికి దగ్గరగాయున్న దేవుడు** తప్పక సరైన అర్థముతో జవాబిస్తాడు.

అలా దేవున్ని అడుగకుండా గ్రంథములోని సూక్ష్మవాక్యములకు స్థూలముగా అర్థమును చెప్పుకొంటే జ్ఞానులు కాలేరు. అందువలన అంతిమ దైవగ్రంథములోని నాలుగు వంతుల అనగా 80 శాతముగల సూక్ష్మ వాక్యముల అర్థము కొరకు దేవున్ని అడిగితే తాను తప్పక జవాబు చెప్పుతానని దేవుడు ఆయత్ రూపములో ప్రజలకు తెలియచెప్పాడు. అయినా మనిషి అహంకారముతో దేవుడు చెప్పినమాటను వదలి ఖురాన్ గ్రంథమును ఏమాత్రము సూక్ష్మముగా అర్థము చేసుకోలేదు. ఎవరయినా తన అంతరంగములో దేవుడు చెప్పిన భావమును ఖురాన్ ఆయత్‌కు చెప్పితే వానిని వక్రబుద్ధియున్నవాడు అని పేరుపెట్టి వాని మాటను లెక్క చేయకున్నారు. అట్లు వానిమాటను లెక్క చేయకపోవడము వలన దేవుని మాటనే లెక్క చేయనట్లగుచున్నది. అందువలన ఖురాన్ గ్రంథములో గల 80 శాతము ముతషాబిహాత్ వాక్యములను అనగా సూక్ష్మమైన వాక్యములను సూక్ష్మముగానే తెలియుట వలన దేవుడు గ్రంథరూపములో చెప్పిన జ్ఞానము సులభముగా అర్థము కాగలదు. అట్లు కాకుండా అన్నీ స్థూల (ముహ్కమాత్)

వాక్యములే అనుకొంటే తప్పులో కాలు వేసినట్లగును. ఖురాన్ గ్రంథము 80 శాతము అర్థము కాకుండా పోగలదు. అటువంటి వాడు 20 శాతము జ్ఞానియని చెప్పవచ్చును. అట్లే 80 శాతము అజ్ఞాని అని చెప్పవచ్చును. ఖురాన్ గ్రంథములోని ఆయత్‌లు 6236 గలవు. అందులో 6000 ఆయత్‌లను తీసుకొని చూచిన 20 శాతమునకు 1200 అగును. 80 శాతమునకు 4800 ఆయత్‌లగును. ఖురాన్‌ను స్థూలముగా అర్థము చేసుకొన్నవానికి 1200 వాక్యములు మాత్రము తెలిసినట్లగును. మిగతా 4800 వాక్యములు తెలియనివగును. అందువలన ఖురాన్ గ్రంథములో స్థూలముగాయున్న వాటిని స్థూలముగానే, సూక్ష్మముగా యున్న వాటిని సూక్ష్మముగానే అర్థము చేసుకోవలెను. అయినా మా మాటను ముస్లీమ్‌లు వినరని పైగా 'మా ఖురాన్ గురించి నీకేమి తెలుసు?' అని అంటారని చెప్పుచున్నాము. ఖురాన్ గ్రంథము సక్రమముగా అర్థము కావాలంటే దేవుడే దిగివచ్చి చెప్పితేనే వినగలరని అనుకొంటున్నాను. సమాజములో ఖురాన్ గ్రంథము 80 శాతము అర్థము కాకుండా పోయినందు వలన **దేవుని రాకకు ఇది సమయము కాదా?** యని అనుకొంటున్నాము.

ప్రశ్న :-**మూడు దైవగ్రంథములలో అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో మాత్రము 80 శాతము సూక్ష్మవాక్యములు గలవని అంటున్నారు. 20 శాతము స్థూలవాక్యములు గలవని అంటున్నారు. మిగతా రెండు గ్రంథములలో అరుదుగా సూక్ష్మవాక్యములు గలవు. ఎక్కువగా స్థూల వాక్యములే యున్నవి. మాకు అర్థమగునట్లు ఖురాన్‌లోగల స్థూలవాక్యము ఒకటి, సూక్ష్మవాక్యము ఒకటి చెప్పవలెనని అడుగుచున్నాము.**

**జవాబు :-** ఖురాన్ గ్రంథములోని స్థూలవాక్యమును సూక్ష్మవాక్యమును ఒకే సూరాలో ప్రక్కప్రక్కనే గలవాటిని చూపిస్తాము చూడండి. అల్‌బఖరా

సూరా 2, ఆయత్ 186 ఇంతకుముందు చెప్పాము. అయినా ఇప్పుడు జ్ఞాపకము చేసుకొందాము. **(2-186) “నా దాసులు నన్ను గురించి నిన్ను అడిగితే నేను వారికి అతి సమీపములో ఉన్నానని, పిలిచేవాడు నన్ను పిలిచినప్పుడు నేను అతని పిలుపును విని జవాబిస్తాను. కావున వాడు సరైన మార్గము పొందటానికి నా ఆజ్ఞను అనుసరించాలి మరియు నాయందు విశ్వాసము కల్గియుండాలి.”** ఈ వాక్యమును సూక్ష్మవాక్యమని చెప్పవచ్చును. దాని ప్రక్క వాక్యమే స్థూలముగా యున్నది చూడండి. **(2-187) “ఉపవాసపు రాత్రులందు మీకు మీ భార్యలతో రతిక్రీడ ధర్మసమ్మతము చేయబడినది. వారు మీ వస్త్రాలు, మీరు వారి వస్త్రాలు. వాస్తవముగా మీరు రహస్యముగా ఆత్మ ద్రోహానికి పాల్పడుచున్నారనే విషయం అల్లాహ్‌కు తెలుసు. కావున ఆయన మీ పాశ్చాత్తాపాన్ని స్వీకరించాడు. ఇంకనూ మిమ్మల్ని మన్నించాడు. ఇకనుండి మీ భార్యలతో సంభోగము చేయండి మరియు అల్లాహ్ మీ కొరకు వ్రాసిన దానిని కోరండి. ఉదయ కాలపు తెల్లరేఖలు రాత్రి నల్ల చారల నుండి స్పష్ట పడే వరకు మీరు తినండి, త్రాగండి. ఆ తర్వాత చీకటిపడేవరకు మీ ఉపవాసాన్ని పూర్తి చేయండి. కానీ మజీద్‌లలో “ఏతెకాఫ్” చేయునప్పుడు మీరు మీ స్త్రీలతో సంభోగించకండి. ఇవి అల్లాహ్ ఏర్పరచిన హద్దులు. కావున ఉల్లంఘించే ఉద్దేశ్యముతో వీటిని సమీపించకండి. ఈ విధముగా అల్లాహ్ తన ఆజ్ఞలను స్పష్టం చేస్తున్నాడు. బహుశా వారు భయభక్తులు కలిగి ఉంటారని**

**చెప్పాడు."** ఈ వాక్యము పూర్తి స్థూలముగా యున్నది. 186వ సూక్ష్మవాక్యము చాలా ముఖ్యముగా కనిపించుచున్నది. 187వ స్థూల వాక్యము వద్దకు వచ్చి చూస్తే భార్యాభర్తలు కాపురము చేయునది గానీ, లేక ఆహార పానీయములు తినేది, త్రాగేదిగానీ బయట ప్రపంచ విషయమగును. 186వ ఆయత్ పూర్తి ఆధ్యాత్మిక సంబంధమైనదిగా ఉన్నది. 187వ ఆయత్ పూర్తి ప్రపంచ సంబంధముగా యున్నది. 186వ ఆయత్‌లో అంతర్ముఖ ఆధ్యాత్మికము గలదు. 187వ ఆయత్‌లో బాహ్యాముఖ ప్రపంచ సంబంధ విషయము గలదు. 186వ ఆయత్‌లో ఎంతో సూక్ష్మత యున్నది. **"నా దాసులు"** అను పదమునుండి జాగ్రత్తగా అర్థమును తీసుకోవలసియుండును. **"అతి సమీపములో"** అంటే ఎంతో జాగ్రత్తగా అర్థము చేసుకోవాలి. దేవున్ని ఎలా అర్థించాలి? దేవుడు అర్థించినవాని మాటను ఎలా వినగలుగును? వినిన తర్వాత ఎలా సమాధానము ఇచ్చును? దేవున్ని అడుగవలసిన విషయము లేవి? ఏ విషయములడిగినప్పుడు ఆయన జవాబు చెప్పును? ఏ విషయములకు చెప్పడు? అని ఎంతో సూక్ష్మ బుద్ధితో ఆలోచించవలసి యుండును. అదే 187వ ఆయత్‌లో భార్యాభర్తల శృంగార సంబంధమైన విషయము తప్ప ఏమీ లేదు. దానిని కూడా అర్థము చేసుకోలేని మనిషి దానిని వదలి ఇంకొక దానిని ఆచరించుచున్నాడు. దేనిని వదలి, దేనిని ఆచరించినా ఆ రెండు విషయములు దైవికమైనవి కానే కావు. ఆ రెండు విషయములలో ఆధ్యాత్మికము మచ్చుకైనా లేదు. అటువంటి ఆచరణల వలన మనిషికి ఆరోగ్యము బాగుండునేమోగానీ జ్ఞానములో ఏ లాభము ఉండదు.

ఖురాన్ గ్రంథములో కొన్ని ముతషాబిహాత్ (సూక్ష్మమైన) వాక్యములు గలవు. ఆరవ సూరా 95వ ఆయత్ యొక్క భావము కొంత సూక్ష్మము,

కొంత స్థూలముగాయున్నది. ఇది పూర్తి సూక్ష్మమైన విషయము కూడా కాదు. ఈ వాక్యములో కొంత సూక్ష్మతకే అది అర్థముగాని విధముగా ఉండిపోయినది. ఈ వాక్యము వద్ద మనుషులు ముఖ్యముగా ముస్లీమ్‌లు పూర్తి తప్పు భావమును పొందియున్నారు. ఈ వాక్యము యొక్క భావము ఏమాత్రము అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ఇప్పుడే కాదు వేయి సంవత్సరములు శాస్త్రపరిశోధన చేసినా అర్థము కాదు. అందువలన ఈ వాక్యము చివరిలో దేవుడు మనుషులను హెచ్చరించుచూ, మీరెందుకు సత్యము నుండి దారితప్పి పోతున్నారని ప్రశ్నించాడు. అలా దేవుడే అడిగినా ఈ వాక్యమువద్ద జాగ్రత్త పడక మాకు తెలుసునని అనుకొంటున్నారు. ఇదే వాక్యమే భగవద్గీతలో సాంఖ్యయోగము 22వ శ్లోకములో గలదు. అయితే అక్కడ హిందువులకు ఆ శ్లోక భావము అర్థము కాలేదు. అర్థము కాలేదను విషయము కూడా వారు చూచుకోకుండా తాపీగా చెప్పుకు పోయారు. నాకు తెలిసి ఈ వాక్యము బైబిలులో చెప్పలేదు. భగవద్గీత, ఖురాన్ గ్రంథములలో మాత్రము గలదు. అయితే అది జఠిలమైన జ్ఞాన విషయమని గ్రహించలేని వారందరూ సులభముగా చెప్పుకపోయారు. అందువలన ఖురాన్ గ్రంథములో దేవుడు ఈ వాక్యము వద్ద **సత్యమును విడచి మీరెటు పోతున్నారని మనుషులను ప్రశ్నించడము జరిగినది.** అయినా మనిషి వెనుదిరిగి దాని అర్థమేమని చూడలేదు. తనకు తెలిసినది సత్యమేయని అనుకొన్నాడు. ఈ వాక్యములో ప్రశ్నించితే దానికి ఎవరూ జవాబు చెప్పలేరు.

అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో ఇటువంటి కష్టమైన, ఎవరికీ అర్థముకాని సూక్ష్మమైన భావముతో కూడుకొన్న వాక్యములు చాలా గలవు. అటువంటి చోటంతా మనిషి ఆ వాక్యములకు తప్పు భావమును

చేకూర్చుకొని స్థూలముగా చెప్పుకోవడము జరుగుచున్నది. అయితే కొన్నిచోట్ల దేవుడే నీవు తప్పుదారి పట్టియున్నావని హెచ్చరించుచూ వాక్యము చివరిలో హెచ్చరికలు చేసినట్లు కొన్ని మాటలను చెప్పాడు. 6వ సూరా, 99వ ఆయత్ చివరిలో వీటిలో విశ్వసించే వారికి సూచనలున్నాయని చెప్పాడు. ఇక్కడ గ్రుడ్డిగా అర్థము చేసుకోవద్దు. **ఇందులో ఎన్నో సూచనలున్నాయి. జాగ్రత్తగా చూడమని దాని అర్థము.** (36-68) వాక్యము చివరిలో సరిగా అర్థము చేసుకోలేదను భావమును వ్యక్తము చేయుచూ **అయినా వారు అర్థము చేసుకోరేమిటి?** అని అన్నాడు. అలాగే (29-44) ఆయత్ చివరిలో ఒక వాక్యమును చెప్పి మనుషులు తప్పుగా అర్థము చేసుకొంటున్నారన్నట్లు **చూడగలిగితే ఇందులో గొప్ప నిదర్శనము దొరుకుతుంది** అని చెప్పాడు. (39-42) వాక్యము చివరిలో అక్కడ చెప్పిన విషయమును మనిషి సరిగా అర్థము చేసు కోలేనందున ఈ విధముగా హెచ్చరించి చెప్పాడు. **ఇందులో ఆలోచించు వారికి గొప్ప సూచనలున్నాయి.** (21-7) ఆయత్ చివరిలో **మీకు తెలియకపోతే తెలిసిన జ్ఞానులను అడిగి తెలుసు కోండి** అని గలదు. (16-65) లో **వినేదానికి ఇందులో నిదర్శన మున్నది** అని అన్నాడు. (10-34) వాక్యము చివరిలో పునర్జన్మల విషయము అర్థము కాలేదని హెచ్చరించుచూ, ఉన్న పునర్జన్మలను లేవని అంటున్నారను కోపముతో ఇలా అన్నాడు. **మీరు సత్యము నుండి ఎటు కొట్టుక పోతున్నారు?** అని చెప్పినా మనిషి మాత్రము అదే అసత్యములోనికి పోవుచున్నాడు. (67-3) ఇక్కడ కూడా సృష్టి విషయము మనిషికి సరిగా అర్థము కాలేదని చెప్పుచూ ఇలా అన్నాడు. **కావాలంటే మరోమారు దృష్టిని సారించి చూడు నీకేమైనా లోపము కనిపిస్తుందేమో?**

(30-21) **నిశ్చయముగా ఆలోచించే వారి కోసము ఇందులో ఎన్నో సూచనలున్నాయి** (30-24) **ఇందులో కూడా బుద్ధిగల జీవుల కోసము ఎన్నో నిదర్శనాలు ఉన్నాయి** అని అన్నాడు. ఈ విధముగా అల్లాహ్ (దేవుడు) చెప్పిన వాక్యములను మనుషులు తప్పుగా అర్థము చేసుకొన్నప్పుడు, ఆ వాక్యము చివరిలోనే మనుషులను దేవుడు మీరు తప్పుదారి పట్టుచున్నారన్నట్లు ఏదో విధముగా హెచ్చరించుచూ వచ్చాడు. అయినా కొందరు దేవుడు చెప్పినా ఏమాత్రము వెనుతిరిగి చూడకుండా తమది జ్ఞానమార్గమే అని అనుకొంటున్నారు.

**ప్రశ్న :- తౌరాత్ గ్రంథములోని జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో ఉన్నదని మీరు చెప్పుచున్నారు కదా! అటువంటప్పుడు మూడు గ్రంథములలో ఏదో ఒక గ్రంథమును చదివినా సరిపోతుంది కదా! మూడు గ్రంథములను చదువవలసిన అవసరముండదు కదా! అయితే అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా 5, ఆయత్ 68లో వ్రాసియున్న దానిని చూస్తే (5-68) "తౌరాత్ (భగవద్గీత), ఇంజీలు (బైబిలు) ఇప్పుడు దేవుడు మీ వద్దకు పంపిన ఈ ఖురాన్ గ్రంథమును మీ జీవితములలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మములో లేనట్లే" యని చెప్పియున్నారు. ఇక్కడ "మూడు గ్రంథములను చదవనిదే, మూడు గ్రంథములను అనుసరించనిదే" యని చెప్పారు. మేము ఇప్పుడు ఒక గ్రంథమును చదివినా సరిపోతుందా? లేక మూడు గ్రంథములను చదువవలసిందేనా?**

**జవాబు :-** 5-68 వ ఆయత్‌లో చెప్పినట్లు మూడు గ్రంథములు చదువ వలసిందే. ఎందుకనగా! భగవద్గీతలో చెప్పిన ఒక వాక్యము బైబిలులో నాలుగు సువార్తలయందు రాలేదు. తర్వాత అదే వాక్యము ఖురాన్

గ్రంథములో వచ్చినది. మధ్య గ్రంథమయిన బైబిలులో మనిషికి కావలసినవి నాలుగు సువార్తలు మాత్రమే. నాలుగు సువార్తలలో 3708 వాక్యములు ఉండగా వాటిలో ముఖ్యమైనవి, మధ్య సారాంశము గలవి దాదాపు 3000 వాక్యములుగా చెప్పుకోవచ్చును. భగవద్గీతలో కల్పిత శ్లోకములను వదలితే, అట్లే కొన్ని వర్ణనా శ్లోకములను వదలితే భగవద్గీతలో ముఖ్యమైన శ్లోకములు దాదాపు 600 ఉండవచ్చును. అట్లే ఖురాన్ గ్రంథములో 6236 వాక్యములు ఉండగా అందులో ముఖ్యమైనవి దాదాపు 6000 వరకు గలవు. ఈ విధముగా లెక్కించితే.

| | | |
|---|---|---|
| **భగవద్గీతలో** | **700 శ్లోకములకు** | **600** |
| **బైబిలులో సువార్తలలో** | **3708 వాక్యములకు** | **3000** |
| **ఖురాన్‌లో** | **6236 వాక్యములకు** | **6000లకు** |

తప్పనిసరిగా వివరణ తీసుకొని చూడవలెను. అట్లు చూస్తే మూడు గ్రంథములలో కొన్ని అర్థముకాని వాటిని వదలివేసినా ఖురాన్‌లో 6000, బైబిలులో 3000, భగవద్గీతలో 600 వాక్యములను చూస్తే భగవద్గీతలో ఉన్న 600 శ్లోకముల సారాంశములు అన్ని ఖురాన్‌లో యున్నా కొన్ని బైబిలులో లేవు. బైబిలులోయున్నవి ఖురాన్‌లో లేవు. భగవద్గీతలో యున్నవి మిగతా రెండు గ్రంథములలో కొన్ని తక్కువ గలవు. అందువలన మూడు గ్రంథములు చదివితే అన్ని ధర్మములు తెలియునని ఖురాన్‌లో 5-68 లో చెప్పియున్నారు. **పునర్జన్మలను** గురించి భగవద్గీతలోయున్నదే మిగతా రెండు గ్రంథములలో గలదు. అయితే అవి ఉన్నట్లు చాలామందికి తెలియకపోవడము వలన మరియు అర్థము కాకపోయిన దానివలన భగవద్గీతలోని జ్ఞానము ఖుర్ఆన్‌లో లేదు అంటున్నారు. అట్లే బైబిలులో లేదు అంటున్నారు. యోచన కల్గి బుద్ధిని ఉపయోగించి చూడగల్గితే

భగవద్గీతలోని పునర్జన్మ విషయములు మిగతా రెండు గ్రంథములలో కూడా ఉన్నట్లు తెలియును.

భగవద్గీతలోని విషయములలో ఏదయినా ఒకటి ఒక గ్రంథములో తక్కువగాయుండును. ఒకవేళ ఉన్నా అర్థము కాని స్థితిలో ఉండును. అందువలన మూడు గ్రంథములు చదువుట వలన ఆచరించుట వలన ఎక్కడో ఒకచోట ఆ విషయము అర్థము కాగలదు. ఉదాహరణకు భగవద్గీతలో **'కర్మయోగము'** అను జ్ఞానము చాలా ముఖ్యమైనది. అనగా మనిషి జీవితములో చాలా ముఖ్యమైనదని అర్థము. అయితే భగవద్గీతలో చెప్పినంత వివరముగా మిగతా రెండు గ్రంథములలో అర్థము కాదు. మొత్తము మీద మిగతా రెండు గ్రంథములలో భగవద్గీతలో చెప్పిన కర్మయోగము గలదు. అయితే అది రెండు గ్రంథములలో అర్థము కాని విధముగా ఉండుట వలన, కర్మయోగము బైబిలులోనూ, ఖురాన్‌లోను లేదనుకుంటారు. బైబిలులో 66 పాఠములుండగా అందులో మధ్యలోగల నాలుగు సువార్తలే మనకు ముఖ్యమని చెప్పుకొన్నాము. నాలుగు సువార్తలలో ఏసు యొక్క జీవితమును చెప్పియున్నా ఒక సువార్తలోవున్న విషయము మరొక సువార్తలో ఉండునను నమ్మకము లేదు. మూడు సువార్తలలో లేని విషయము ఒక సువార్తలో ఉండవచ్చును. అలాగే మూడు సువార్తలలో ఉన్న విషయము ఒక సువార్తలో లేకపోవచ్చును. అందువలన సువార్తల అన్ని విషయములు తెలియుటకు నాలుగు సువార్తలను చదువవలసిందే. నాలుగు సువార్తలు చదవనిదే ఏదో ఒక విషయము తెలియకపోవచ్చును లేక అర్థము కాకపోవచ్చును.

అదే విధముగా మూడు గ్రంథములలో ఒకే విషయము ఉండవచ్చును, ఉండకపోవచ్చును. ఉన్నా అర్థము కావచ్చును, అర్థము

కాకపోవచ్చును. అందువలన మూడు గ్రంథములు చదువుట వలన ఆ విషయము ఎక్కడో ఒకచోటయినా అర్థము కాగలదు. భగవద్గీతలో మోక్ష సన్న్యాస యోగమున 17వ శ్లోకమున చెప్పిన జ్ఞానమునే సువార్త బైబిలులో మత్తయి ఐదవ అధ్యాయము 28వ వచనములో చెప్పియున్నారు. అయితే అదే ఇదియని బైబిలు చూచిన వారికి తెలియదు. బైబిలు మత్తయి 5-28లో యున్న విషయమే భగవద్గీతలో మోక్షసన్న్యాస యోగమున 17వ శ్లోకముగా యున్నదని భగవద్గీత చదివిన వారికి తెలియదు. ఇక ఖురాన్ విషయమునకు వస్తే ఏదయితే మోక్షసన్న్యాస యోగమున 17వ శ్లోకమున యున్నదో, అట్లే మత్తయి సువార్త 5లో 28వ వచనములో ఏదయితే ఉన్నదో అదే ఖురాన్ గ్రంథములో సూరా ఆరులో ఆయత్ 102లో ఉన్నదని తెలియదు. మొత్తము మీద మూడు గ్రంథములలో ఒకే విషయము ఉన్నదను విషయము మూడు మతముల వారికి తెలియదు. అందువలన మూడు గ్రంథములను చదువగలిగితే అక్కడున్న జ్ఞానము ఏదో ఒకచోటయినా అర్థము కాగలదు. అట్లు కాకుండ ఒకే గ్రంథము చదివినా అందులో మిగతా రెండు గ్రంథముల విషయమున్నా అది అర్థము కావచ్చును, కాకపోవచ్చును. మూడు చదువుట వలన మూడింటిలో ఒకే జ్ఞానమున్నదని తెలియడమే కాక దానిని బాగా అర్థము చేసుకొను అవకాశము కలుగవచ్చును. అందువలన మూడు గ్రంథములు చదివి అనుసరించమని ఖురాన్‌లో 5-68 లో చెప్పారు.

**ప్రశ్న :- భగవద్గీతలోని జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో ఉన్నదని చెప్పారు. మొత్తము మీద మూడు గ్రంథములు దైవగ్రంథములుగా చెప్పబడినవి. ఒకే దేవుని జ్ఞానము మూడు గ్రంథములలో కాకుండా ఒకే గ్రంథములోయుంటే అందరూ దానినే చదివేవారు. అట్లుకాకుండా మూడు గ్రంథములుగా ఉండుట వలన మనుషులు మూడు భాగములుగా, మూడు**

గుంపులుగా చీలిపోయి ఒక్కొక్క గుంపు ఒక్కొక్క గ్రంథమును చదువుచూ 'ఇది మా గ్రంథము' అని అంటున్నారు. మూడు గుంపుల వారు ఇది మాది, అది మీది అనడము వలన 'మాది గొప్ప మీది తక్కువ' అను అసూయ వారిలో రావడము జరిగినది. మనుషులలో అసూయ గుణము ఉండుట వలన తన గ్రంథము అని చెప్పబడు దానిని తప్ప రెండవ గ్రంథమును ముట్టుకొను స్థితిలో మనిషి లేడు. ఇట్లు ఒక మతము వారు ఒక గ్రంథమునే చదువుచూ మిగతా గ్రంథమును అన్యమత గ్రంథముగా భావించి మేము చదవము అని చెప్పుచున్నారు. మత పెద్దలుగా యున్నవారే ప్రజలలో ద్వేష భావము కల్గించి ఇతర గ్రంథములను చదువకూడదని చెప్పుచున్నారు. ఒక మతములోని మత పెద్దలే అలా చెప్పడము వలన ఆ మతస్థులందరూ ఇతర గ్రంథములను ముట్టుకోకుండాయున్నారు. ఇతర రెండు గ్రంథములను ముట్టుకుంటే కూడా తప్పేయను భావములో యుండుట వలన క్రైస్థవులు మా బైబిలును తప్ప ఇతర గ్రంథములు చదవము అని అంటున్నారు. దేవుడే దిగివచ్చి చెప్పినా వినే స్థితిలో లేరు. అటువంటప్పుడు మీరు మూడు గ్రంథములను చదువమని చెప్పడము కొందరికి వింతగా కనిపించుచున్నది. మీరేమో ఖురాన్ గ్రంథములోని వాక్యమును తీసి చెప్పుచున్నారు. హిందువులు, క్రైస్థవులు ఖురాన్ గ్రంథము యొక్క విలువ తెలియనివారై యుండుట వలన వారు చదివే స్థితిలో లేరు. ఇతర మతము లను చూచి ఓర్వలేని వారు, అసూయపడువారు, ద్వేషమును పెంచుకొన్న వారు ఇతర మతముల గ్రంథములను చదువగలరా? అది ముమ్మాటికీ జరుగని పని. నేటి మానవ సమాజము ఎంతో అజ్ఞానములో కూరుకుపోయి ఉండగా, మూడవమారు భగవంతుడు వస్తాడని చెప్పినా వానిని మనుషులు వినగలరా?

దేవుడు రెండుమార్లు మనిషిగా వచ్చి మూడు దైవగ్రంథములను ఇచ్చినందువలన మూడవ మారు దేవుడు వచ్చి జ్ఞానమును చెప్పితే దానిని ఆలకించగలరా? రేపు మూడవమారు వచ్చిన భగవంతుడు తన జ్ఞానమును గ్రంథరూపముగా ఇస్తే, ఇప్పుడే ఇంకొక దానిని చూడనివారు అప్పుడు దానిని చూడగలరా? పుట్టిన ప్రతి మనిషి పుట్టుకతోనే ఏదో ఒక మతమువాడుగా పుట్టుచున్నాడు. వానికి బుద్ధి వచ్చినప్పటినుండి వాడు పుట్టిన మతమునే పొగిడే తర్ఫీదు (ట్రయినింగ్) పొందియుండును. అటువంటప్పుడు మూడవ భగవంతుని మాటను ఎవడయినా వినగల డంటారా? ఖురాన్ గ్రంథమును అంతిమ దైవగ్రంథమని ఎందుకు అంటున్నామో తెలియనివారు దీని తర్వాత ప్రవక్తరాడు, జ్ఞానము రాదు అంటున్నారు. అలాంటప్పుడు ఈ మారు భగవంతుడు వస్తే ఆయనను జ్ఞానము తెలిసినవానిగా కూడా చూస్తారో లేదో తెలియదు. రెండవ జ్ఞానము పుట్టదు, పుట్టేదంతా అంతిమ దైవగ్రంథములోనే చివరిగా పుట్టినది అనుచుండగా, దేవుడు వచ్చి పుట్టినా ఆయనను ప్రవక్తగా కూడా చూడరు, జ్ఞానిగా కూడా చూడరు. వచ్చే భగవంతుడు చెప్పిన జ్ఞానము గ్రంథరూప మైనా దానిని గ్రంథముగా కూడా లెక్కించరు. ఇటువంటి అజ్ఞాన సమయములో దేవుడు భగవంతునిగా వస్తాడంటారా?

ముస్లీమ్‌లు అంతిమ దైవగ్రంథములోనే చివరిగా వచ్చే జ్ఞానమంతా వచ్చిందని అనుచుండగా, హిందువులు నేడు తమ మత రక్షణకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చుచున్నారు. హిందువులను ఇతర మతస్థులు వారి జ్ఞానముతో ఆకర్షించుచుండగా తమ జ్ఞానమిదియని చెప్పుకోలేనివారై ఇతర మతముల మీద దాడులు చేయడమే పనిగా పెట్టుకొన్నారు. హిందువుల

జ్ఞానము హిందువులకే తెలియనిదై పోవడము వలన, వారి జ్ఞానమును వారే గుర్తు పట్టలేనివారై ఏది తమ జ్ఞానమో, ఏది ఇతరుల జ్ఞానమో తెలియని స్థితిలోయున్నారు. అనుమానపు మొగుడు అందరికీ రంకు అంటగట్టినట్లు, అజ్ఞానపు హిందువులు జ్ఞానము చెప్పు హిందువులనే ఇతర మతముల వారిగా లెక్కించి వారిని కొట్టడము వలన, హిందువులు హిందువులనే కొట్టుకొన్నట్లగుచున్నది. 'హిందూ రక్షణ' అను పేరుతో ఎవరో ప్రేరేపించితే గ్రుడ్డివారై మనము ఏమి చేయుచున్నామను విచక్షణ లేకుండా తమ జ్ఞానుల మీద తామే దాడి చేయుచూ జ్ఞానమును చెప్పవద్దనుచున్నారు. చెప్పే జ్ఞానము హిందువులదేయని తెలియక, జ్ఞాన విషయమే తెలియనివారై మొండిగా దాడులకే పరిమితి యగుచున్నారు. జ్ఞానము అనునది హిందూ మతరక్షకుల వద్ద ఏమాత్రము లేకుండా పోవడము వలన వారి చేతులతో వారే హిందూ జ్ఞానమును కూడా అడ్డుకుంటున్నారు. అటువంటి పరిస్థితిలో దేవుడు భగవంతునిగా వస్తే, వచ్చి జ్ఞానమును చెప్పితే అది ఏ జ్ఞానమో తెలియని వారు వచ్చిన భగవంతున్ని కూడా వదలిపెట్టరు.

భగవంతుడు వస్తే ఆధ్యాత్మిక జ్ఞానమును బోధించును. అందులో ఆత్మజ్ఞానము తప్ప దేవతల జ్ఞానముండదు. ఎప్పుడయితే దేవతల జ్ఞానము గానీ, దేవతల పూజగానీ లేకుండునో అప్పుడు వారు ఇతర మతములుగా లెక్కించు హిందువులు దేవుడు చెప్పే ఆధ్యాత్మిక జ్ఞానమును వినగలరా? ఆయనను ఆటంకపరుచరా? ద్వాపరయుగము చివరిలో వచ్చిన భగవంతుడు కృష్ణుడని వ్యాసుడు వ్రాసిన భగవద్గీత వలన నేడు తెలిసింది. ఆనాడు కృష్ణుని గురించి ఎవరికీ తెలియదు. నేడు హిందూమత రక్షకులు కృష్ణున్ని నిందించడము చూచాను. ఎందుకంటే కృష్ణుడు తన భగవద్గీతలో

రాముడు దేవుడని వ్రాయలేదట. ఇంకా ఏమన్నారంటే "ఏదో పెద్ద జ్ఞానము చెప్పాడని భగవద్గీతను కొందరు గొప్పగా చెప్పుచున్నారు. అందులో ఏమి గొప్పతనముందని, కొందరు హిందూ మత రక్షకులు అనడము నేనే స్వయముగా విన్నాను. భగవద్గీతలో హిందూ సంస్కృతి ప్రకారము పూజలు చేయమని చెప్పాడా? రామున్ని ఆరాధించమని చెప్పాడా? రామున్నే కాదు ఎవరిని గురించి చెప్పకుండా నన్నే పూజించు అని చెప్పాడు. తన స్వంత డబ్బా కొట్టుకొని అందరినీ తన భక్తులను చేసుకోవాలనుకొన్నాడు. అంత తప్ప ప్రజలకు భక్తిమార్గమును బోధించాడా? కొందరు బుద్ధి తక్కువ వారు గ్రుడ్డిగా భగవద్గీతను హిందువుల గ్రంథమని అంటున్నారు. అందులో హిందువుల తరపున చెప్పినది ఏమయినా గలదా? మేము ఎప్పుడు కూడా కృష్ణున్ని గానీ, ఆయన వ్రాసిన భగవద్గీతనుగానీ ఒప్పుకోము. హిందూ సంస్కృతిని గురించి, అయోధ్య రామున్ని గురించి బోధించని వారిని ఎప్పటికీ ఒప్పుకోము" అని అంటున్నారు.

భగవద్గీతను చెప్పి ఐదువేల సంవత్సరములయినా దాని గొప్ప తనము తెలియక మేము హిందువులము అని ముఖము మీద బొట్టుపెట్టుకొన్న వారే ఇట్లు మాట్లాడుచుంటే సాధారణ ప్రజానీకము భగవద్గీత అంటే ఏమిటో తెలియని స్థితిలోయున్నారు. అందువలన మిగతా రెండు మతముల వారితో హిందువులను పోల్చితే ఆయా మతములవారు కొందరు గ్రంథమును చదివినా, మిగతా వారు గ్రంథమును గౌరవించుచున్నారు. ఇది మా గ్రంథము అని చెప్పుకొంటున్నారు. అయితే హిందువుల విషయమునకు వస్తే వేదములే మన గ్రంథములని చెప్పుచున్నారు. భగవద్గీత మన గ్రంథము కాదా!యని అడిగితే దానికి వారు చెప్పిన జవాబు ఇలా ఉన్నది. "భగవద్గీత హిందూ గ్రంథమేయనవచ్చును గానీ, అది నిన్న

మొన్న తయారయినది. పూర్వము కృతయుగమునుండి సనాతన ధర్మము లను బోధిస్తున్నవి వేదములు. హిందువులు అంటే వేదములు అని చెప్పాలిగానీ భగవద్గీతయని చెప్పకూడదు" అని అంటున్నారు. హిందూ ధర్మములను ఉద్ధరిస్తున్నామని, మాకంటే తెలిసినవారు లేరని, హిందూ మతమునకు రక్షకులుగా చెప్పు కొనువారు అనుచున్నారు. అదే హిందూ మత రక్షకులలోనే ఒక గుంపు రాముడు దేవుడని బోధించుచుండగా, మరొక గుంపు భజరంగబలి అయిన హనుమంతుడే దేవుడని చెప్పు చున్నారు? శివసేనయను గుంపువారు శివుడే గొప్పయని "ఓం నమః శివాయ" అని అంటున్నారు. మరొక హిందూ రక్షకులు 'జై శ్రీరామ్' అంటున్నారు. మరొక గుంపువారు 'జై భజరంగబలి' అంటున్నారు. ఒకవేళ ఆ సమయానికి మేము అక్కడున్నా వారు ఏమంటే అదే జై అనాలి. లేకపోతే మనకున్న మర్యాద కూడా పోతుంది. నేడు హిందువులు వారి దేవుడు ఎవరో వారికే తెలియక, వారి గ్రంథము ఏదో వారికే తెలియక, వారి జ్ఞానమేదో వారికే తెలియకయున్నారు. ఇటువంటి క్లిష్టపరిస్థితిని చూస్తే **"దేవుని రాకకు ఇది సమయము కాదా?"** యని అనిపిస్తున్నది.

దేవుడు వచ్చినా ఆయన దేవుడుగా రాడు. సాధారణ మనిషిగా వస్తాడు. ఆయనను ఎవరూ గుర్తించుటకు వీలుండదు. అయినా ఆయన దైవజ్ఞానమయిన తన జ్ఞానమును చెప్పనే వస్తాడుగానీ, తానే స్వయముగా సృష్టించిన దేవతలను గురించి చెప్పనురాడు. దేవతా పూజను గురించి చెప్పితేనే వాడు హిందువు అని, మొండి గుర్తుగాయున్న హిందువులు ఆత్మజ్ఞానమును చెప్పితే, వారికి ఆత్మజ్ఞానమును గురించి తెలియని దాని వలన, అంతేకాక వారికి గ్రహించుశక్తి లేనిదానివలన చెప్పేది హిందూ

ధర్మముల జ్ఞానమేనని తెలియక, చెప్పేవాని మీదికి దాడిచేసి తరిమివేస్తారు. అటువంటి పరిస్థితి ఉన్నదని చెప్పుటకు మేమే నిదర్శనము. మేము స్వచ్ఛమయిన భగవద్గీతా జ్ఞానమును ఎక్కడ చెప్పినా అక్కడ మమ్ములను హిందువులు కాదని, మేము చెప్పు జ్ఞానము హిందువుల జ్ఞానము కాదని అనడము జరిగినది. మేము దైవ జ్ఞానమును ప్రచారము చేయుటకు ఒక పెద్ద సంస్థను స్థాపించి, ఆ సంస్థలో పని చేయు సభ్యులందరూ దేవుని జ్ఞానమయిన భగవద్గీతను ప్రచారము చేయునట్లు ప్రోత్సహించాము. కొన్నిచోట్ల మా ప్రచారమునకు ఎంతో మంచిపేరు రాగా, ఎక్కడయితే హిందూ మత రక్షకులున్నారో అక్కడంతా మా జ్ఞాన ప్రచారమునకు వ్యతిరేఖత వచ్చినది. మా జ్ఞాన ప్రచారమును అక్కడ ఆపి ఊరు వదలి పొమ్మని చెప్పిన సంఘటనలు ఎన్నో ఉన్నాయి. భౌతికముగా దాడి చేసి మీరు హిందువుల ముసుగులోయున్న క్రైస్థవులని దూషించిన సమయములు ఉన్నాయి.

మేము హిందూ మతములో అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతములున్నట్లే త్రైత సిద్ధాంతమును శాస్త్రబద్ధముగా ప్రతిపాదించి, త్రైత సిద్ధాంతము ప్రకారము భగవద్గీతను వ్రాసి ప్రచారము చేస్తే మమ్ములను క్రైస్థవులని అన్నారు. 'త్రైత' అని పేరు వినిపించిన వెంటనే మమ్ములను క్రైస్థవులుగా లెక్కించుచున్నారు. దానికి కారణము క్రైస్థవమతములో త్రిత్వము అను మాటగలదు. వారు త్రిత్వమును గురించి చెప్పుచుందురు. అందువలన మేము చెప్పు జ్ఞానమును అర్థము చేసుకోలేనివారు మమ్ములను కూడా క్రైస్థవులుగా చెప్పడమే కాక భగవద్గీతను కూడా హిందూ ముసుగు తొడిగిన బైబిలు అంటున్నారు. దాదాపు వంద కమిటీలు గలిగి దాదాపు

పదివేల మంది జ్ఞాన ప్రచారము చేయు సభ్యులున్న మేమే ఎన్నో ఆటుపోట్లకు తట్టుకొని జ్ఞాన ప్రచారము చేయుచున్నాము. నేను ఎవరో ఎవరికీ తెలియదు. నన్ను నా భక్తులు తప్ప మిగతా వారు నా దగ్గరకు వచ్చే అవకాశము కూడా లేదు.

మేము హిందువులమైయుండి హిందువుల మధ్య హిందూ జ్ఞానమును ప్రచారము చేయుటకు ఎంతో ఇబ్బంది పడుచున్నాము. నేడు పరమతములు ఉన్నాయి, కావున మా జ్ఞానమును పరమతము వారు వ్యతిరేఖించినా దానికి ఒక అర్థమంటూయున్నది. హిందువులు వ్యతిరేఖిస్తే దానికి అర్థమే లేదు. పరమతముల మీద అసూయ ద్వేషములతోయున్న హిందువులు గ్రుడ్డివారై, జ్ఞానమును గుర్తించలేనివారై నేడు మమ్ములను వ్యతిరేఖించుచున్నారు. అయితే కృష్ణుడు వచ్చిన ద్వాపరయుగము చివరిలోనికి పోతే ఆనాడు ఇతర మతముల ప్రసక్తే లేదు. ఏమున్నా ఒక్క హిందుత్వము తప్ప ఇతరములు ఏమీ లేవు. అటువంటి సమయములో కూడా కృష్ణుడు తాను భగవద్గీత జ్ఞానము చెప్పినట్లు ఎవరికీ తెలియకుండా చేశాడు. తాను ధర్మములను తెలియజేయుటకు భూమిమీదికి వచ్చినా, ఆ విషయము ఎవరికీ తెలియనట్లు జాగ్రత్తపడ్డాడు. అంతేగాక ఆయన ప్రత్యక్షముగా పదిమందికి ఎక్కడా జ్ఞానమును చెప్పలేదు. భగవద్గీతను ఒక్కదానిని చెప్పినా అది ఎవరికీ తెలియకుండా, ఎవరూ వినని జాగాలో అర్జునునికి ఒక్కనికి తెలియజేశాడు. కృష్ణుడు అలా చెప్పినది కూడా వ్యాసుడు భగవద్గీతను వ్రాసి బయట ప్రపంచము లోనికి పంపుట వలన తెలిసినది. కృష్ణుడు భగవద్గీతను చెప్పాడు అని బయట ప్రపంచమునకు తెలిసేటప్పటికి వేల సంవత్సరములు గడచిపోయాయి. నేడు భగవద్గీతను

విమర్శించినా లేక సమర్థించినా అది నేరుగా కృష్ణునికి తెలిసే అవకాశము లేదు. ఏమున్నా సరిపోనివారు ఆయనను చాటునుండి తిట్టవలసిందేగానీ, ప్రత్యక్షముగా తిట్టే అవకాశము లేదు. జ్ఞానము చెప్పుట వలన మానవ సమాజములో ఎన్నో చిక్కులు వచ్చునని తెలిసిన కృష్ణుడు, అర్జునునికి ఒక్కనికి చిటుక్కున చెప్పి చటుక్కున పోయాడు.

నేడు మేము ప్రత్యక్షముగా జ్ఞానమును చెప్పుట వలన అనేక ఆటుపోట్లు మాకూ తప్పక యున్నాయి. అయినా అన్నిటినీ ఎదుర్కొని భూమిమీద ఎదురాడని జ్ఞానమును బోధిస్తున్నాము. ఇతర మతములు లేని సమయములోనే ఎందుకయినా మంచిదని ఆయన ప్రత్యక్షముగా ఎవరికీ జ్ఞానము చెప్పలేదు. చెప్పినది ఒక్కనికే, అయినా ఆ ఒక్కడు తనకు దగ్గర బంధువు అగుట వలన అతని వలన ఏ ఇబ్బంది ఉండదను నమ్మకముతో చెప్పాడు. అప్పుడే కృష్ణుడు మానవ సమాజము యొక్క అజ్ఞానమును గుర్తించి దానికి తగినట్లు, తాను జ్ఞానమును చెప్పినట్లు కూడా ఎవరికీ తెలియకుండా చెప్పిపోయాడు. ఇతర మతములు లేని ఆ కాలములోనే ఎన్నో జాగ్రత్తలు తీసుకొని కృష్ణుడు తన రాకకు తగిన న్యాయము చేసి జ్ఞానమును చెప్పిపోయాడు. ఇప్పుడు దేవుని రాకకు ఇది సమయమే అయినా ద్వాపర యుగములోనే దొంగగా ఎవరికీ తెలియ కుండా చెప్పిపోయాడు. ఇప్పుడు పూర్తి అజ్ఞాన సమయము, ఇతర మతములున్న సమయములో జ్ఞానమును భూమిమీద ఎలా చెప్పును? అనేదే పెద్ద ప్రశ్నగాయున్నది. ఒకవేళ మనము బ్రతికియున్నప్పుడు ఆయన ఇప్పుడే వస్తే ఎలా జ్ఞానమును చెప్పి అధర్మములను లేకుండా చేయగలడో, ఎలా ధర్మములను తెలియజేయగలడో చూడాలనివుంది. అయినా వచ్చిన ఆయన ఎవరు? అను విషయము తెలియదు, కావున ఆ కోరిక మాకు తీరదని తెలిసిపోయినది.

**మీకు భూమిమీద ఎంతో జ్ఞానమును తెలియజేసిన అనుభవ మున్నది. నేడుగానీ, రేపుగానీ దేవుడు మనిషిగా దిగివచ్చి భగవంతునిగా జ్ఞానమును తెలియజెప్పితే, ఎలా చెప్పగలడో? ఏమి చేయగలడో అను మా ప్రశ్నలకు మీరే జవాబు చెప్పాలి. అందువలన మిమ్మలనే అడుగు చున్నాము, జవాబు చెప్పండి. మీ జవాబు మాకు సులభముగా అర్థమయ్యే లాగ ఉండవలెను. ద్వాపరయుగములోనే, ఇంత అజ్ఞానము లేని సమయములో కృష్ణుడు జ్ఞానమును చెప్పుటకు భయపడినట్లు చాటుగా ఒక్కనికే, అదియు తనమాట విను అర్జునునికి మాత్రము చెప్పాడు. ఈ కాలములో వచ్చు భగవంతుడు భయపడకుండా జ్ఞానమును చెప్పునా? ప్రత్యక్షముగా ధర్మములను బోధించునా?**

**జవాబు :-** నా జవాబుకంటే నీ ప్రశ్నే చాలా పెద్దగా కనిపించుచున్నది. బహుశా ప్రపంచములో ఇంత పెద్ద ప్రశ్న ఎక్కడా ఉండదనుకొంటున్నాను. ద్వాపరయుగములో వచ్చిన కృష్ణుడు ఎవరికీ భయపడలేదు. చూచేవారికి ఆయన భయపడి బయటికి తెలియునట్లు తన బోధను చెప్పలేదన్నట్లుగానే యున్నా మనమనుకొన్నట్లు ఆయన ఎవరికీ భయపడలేదు. కృష్ణుడు తన జ్ఞానము వలన, అధర్మములను బోధించిన, అధర్మములకు పుట్టినిల్లయిన వ్యాసున్ని మార్చవలెనని పథకము రచించుకొన్నాడు. ఆ పథకము ప్రకారము నడుచుకొన్నాడు. తాను చెప్పు జ్ఞానము ఇతరులకు తెలిస్తే వ్యాసుడు ఇతరులకు తెలిసిన జ్ఞానము వలన మారడు, అప్పుడు వ్యాసునిలో అహము పని చేయును. నాలుగు వేదములను, పదునెనిమిది పురాణములను బోధించిన వ్యాసున్ని మార్చుటకే కృష్ణుడు ద్వాపరయుగములో ఒక పద్ధతిని అనుసరించి జ్ఞానమును చెప్పాడు. అంతేగానీ ఇతరులకు భయపడినాడని చెప్పకూడదు. రేపు వచ్చే భగవంతుడు ముందే తన జ్ఞానమును బోధించు

విధానమును అంతటిని నిర్ణయించుకొని వచ్చును. ఆయన నిర్ణయము ప్రకారమే జరుగును. అంతేగానీ ఆయన భయపడువాడు కాడు.

ఈ మారు దేవుడు మనిషిగా భగవంతుడై వస్తే, గత రెండు జీవితములకంటే ఈ మారు తన జీవితములో కొంతమార్పుతో యుండును. ద్వాపరయుగములో వచ్చిన కృష్ణుడు ధనికుడుగా ఉండేవాడు. కలియుగములో వచ్చిన ఏసు చాలా పేదవానిగా ఉండేవాడు. ఈ మారు ఆయనను ఎవరూ గుర్తించనట్లు ఆ రెండు జన్మలకు విభిన్నముగా ఉండునని అనుకొంటున్నాము. ఈ మారు కొంత కాలము పేదవానిగా, కొంత కాలము ధనికుడుగా వచ్చునని అనుకుంటున్నాము. ఆయన ఎలా వచ్చునది ఆయన నిర్ణయము మీద ఆధారపడియుండును. అందువలన మనము చెప్పుటకు అర్హులము కాము. ఆయన ఎలా ఉంటాడు? అనే దానికంటే 'ఆయన ఎలా జ్ఞానమును తెలియజేస్తాడు' అనునదే ముఖ్యము. ఆయన ఎలా వచ్చినా మనిషివలె రావలసిందే. నేడు ఒక మనిషి అదియూ క్రొత్తగా వచ్చిన మనిషి చెప్పు జ్ఞానమును మనుషులు వినే స్థితిలో లేరని మనకు తెలుసు. అయితే దేవుడు భూమిమీద అవతరించునది తన జ్ఞానమును తెలియజేయుటకే, అందువలన ఈ దఫా భగవంతునికి జ్ఞానము చెప్పడము పెద్ద సవాల్‌గా ఉంటుంది. ఆయన ఎలా చెప్పుతాడో ఆయన పథకము ఆయనకుంటుంది. ఆయన విషయము మనము చెప్పలేము అనడమే మంచిది. అంతకంటే ఎక్కువ చెప్పటానికి మనిషిగా నాకు అనుమతి లేదు, అర్హత లేదు.

**ప్రశ్న :- మా ప్రశ్నకు మీ వద్ద జవాబు లేదు అన్నట్లే కదా! అయితే మా ప్రశ్నలకు జవాబు ఎక్కడ దొరుకును?**

**జవాబు :-** ఎందుకు దొరకదు, ఆ దొరికేది ఏదో అది నా వద్దనే దొరకాలి.

ఎందుకనగా! వచ్చేవానిలోని ఆత్మ నాలో కూడా ఉన్నది, గనుక ఆత్మే అందరి రహస్యమును కూడా చెప్పగలదు. అయితే జరుగబోయే ప్రణాళికను గురించి ఎవరికీ ముందు తెలియకూడదు. రాబోయేది భగవంతుని జన్మ అయినందున, భగవంతుని జన్మను గురించి ఎవరికీ తెలియకూడదను నియమము ప్రకారము ఆత్మ ఆ విషయమును బయటికి చెప్పదు. ధర్మమును అతిక్రమించి నేను ప్రవర్తించను. నాలోని ఆత్మ ప్రవర్తించదు. అందువలన ఆ విషయము తెలిసినా బయటకు చెప్పదు. జీవితమునకు సంబంధించినది కాకుండా జ్ఞానమునకు సంబంధించిన ప్రశ్నను అడుగు చెప్పుతాడు.

**ప్రశ్న :- అయితే మరొక విధముగా మరొక ప్రశ్నను అడుగుచున్నాను. ఇంతకు ముందు దేవుడు రెండుమార్లు భగవంతునిగా వచ్చినప్పుడు బోధను మాత్రము చెప్పిపోగా తర్వాత కొంత కాలమునకు ఆ బోధ గ్రంథరూపమైనది. అలా వచ్చినవే భగవద్గీత, బైబిలు గ్రంథములు. ఈ దఫా వస్తే తాను చెప్పవలసిన జ్ఞానమును బోధరూపములో చెప్పునా, గ్రంథరూపములో చెప్పునా?**

**జవాబు :-** ఇంతకుముందే చెప్పాను. ముందు ప్రవర్తించినట్లే ప్రవర్తించదని, అందువలన భగవంతుడు ఈ మారు బోధరూపములో చెప్పడు, ఆయన చెప్పేదంతా గ్రంథరూపములోనే చెప్పును. కృష్ణునిగా వచ్చినప్పుడు రహస్యముగా ఒక్కనికే ఒక్కమారు మాత్రమే జ్ఞానమును చెప్పాడు. రెండవ మారు ఏసుగా వచ్చినప్పుడు బహిరంగముగా అందరికీ మూడు సంవత్సరముల పాటు జ్ఞానమును చెప్పాడు. మూడవమారు వస్తే వాటికి విభిన్నముగా జ్ఞానమును బోధించవలసియుంటుంది. అందువలన ఒక్కనికి చెప్పడు, అందరికీ చెప్పడు. రహస్యముగా వ్రాతరూపములో వ్రాసిన జ్ఞానమును లక్షలమంది ప్రజలకు అందిస్తాడు. అందువలన ఆయన

జ్ఞానమును బయటికి పది పైసలు చెప్పినా పూర్తి రూపాయియంత గ్రంథముల ద్వారానే చెప్పును. పూర్వము భగవంతుడుగా చెప్పిన జ్ఞానము భగవంతుడు లేకుండా పోయిన తర్వాత గ్రంథరూపమైనది. ఇప్పుడు అట్లు కాకుండా ఆయన వ్రాతలోనే జ్ఞానము బయటికి వచ్చును.

**ప్రశ్న :- భగవంతుడు ముందు రెండుమార్లు చెప్పిన జ్ఞానము రెండు దైవగ్రంథములుగా తయారయినది. ఈ దఫా వచ్చి చెప్పకుండా వ్రాత రూపములోనే ప్రజలవద్దకు జ్ఞానమును గ్రంథరూపములో పంపును అని చెప్పుచున్నారు. ఈ మారు వ్రాయు గ్రంథములకు దైవ గ్రంథములను పేరుండునాయని అడుగుచున్నాము?**

**జవాబు :-** భూమిమీద ఉండవలసినవి దైవగ్రంథములని పేరుగలవి మూడు మాత్రమే. ఆ మూడు ఇప్పటికే ఉన్నాయి. రెండు భగవంతుడు చెప్పిన జ్ఞానముతో ఉండగా, మూడవది జిబ్రయేల్ (సూర్యుడు) చెప్పిన జ్ఞానముతో నిండియున్నది. రెండుమార్లు భగవంతుడు చెప్పిన జ్ఞానము రెండు గ్రంథములుగానేయున్నది. కృష్ణుడు చెప్పినది భగవద్గీతకాగా, ఏసు చెప్పినది బైబిలుగా యున్నది. అయితే ఈ మారు చెప్పునది ఒక గ్రంథముగా ఉండదు. అనేక పేర్లతో అనేక గ్రంథాలుగా యుండవచ్చును. అప్పుడు ఒక జన్మకు ఒకటయితే ఇప్పుడు ఒక జన్మకే వంద గ్రంథములుండవచ్చును. ఒక గ్రంథమయితే దానిని దైవ గ్రంథమనవచ్చును, అనేక గ్రంథములను దైవ గ్రంథమని చెప్పుటకు వీలులేదు. అయితే భగవంతుడు స్వయం రచనలను ప్రజలే పేరుపెట్టి పిలుచుదురు. ఆయన గ్రంథములకు దైవగ్రంథమని పేరు లేకున్నా, ప్రత్యేకమైన పేరును ప్రజలే చెప్పుదురు.

**ప్రశ్న :- ఈ దఫా భగవంతుని ఆయుష్షు ఎంత ఉండును?**

**జవాబు :-** నేను ముందే చెప్పాను. ఆయన జీవితమునకు సంబంధించిన ప్రశ్నను అడుగవద్దని, అయినా నీవు అడుగుచున్నావు. ఇప్పుడు జవాబు చెప్తుతాను. రెండవ దఫా ఇటువంటి ప్రశ్నను అడుగవద్దు. దేవుని ఒక జన్మకు సంబంధించిన మూడు భాగములలో మొదట భగవంతునిగా వచ్చిన కృష్ణుడు మొత్తము 126 సంవత్సరములు బ్రతుకగలిగాడు. రెండవ దఫా ఏసుగా వచ్చినప్పుడు దానిలో సగము 63 సంవత్సరములు బ్రతికాడు. ఇప్పుడు మూడవమారు వస్తే 70 సంవత్సరముల పైన బ్రతుకునని చెప్పవచ్చును. మొదటి జీవితము 126 ను 1+2+6 ను కూడితే తొమ్మిది వచ్చుచున్నది. అలాగే రెండవ జీవితము యొక్క ఆయుష్షు 63 సంవత్సరములు కాగా అందులో 6+3 కలిపితే తొమ్మిది వచ్చును. అలాగే ఇప్పుడు వచ్చు మూడవ జన్మ కూడా బహుశా 7+2 కలిసి తొమ్మిది ఉండునట్లుండును అని అనుకొంటున్నాను. అందువలన 72 సంవత్సరములుగానీ లేక 72 నుండి 81వ సంవత్సరము వరకు గానీ ఉండవచ్చును అని అనుకొంటున్నాను. ఈ మాటను చెప్పినది కూడా లోపలయున్న ఆయనే (ఆత్మనే) అయినా మనలను మభ్యపెట్టుటకు కూడా చెప్పియుండవచ్చును. ఆయన నిర్ణయము ఆయనకే తెలుసు.

**ప్రశ్న :- ముందు రెండుమార్లు వచ్చినప్పుడు 'మతము' అను ప్రసక్తి లేకుండెడిది. ఏసుగా వచ్చిపోయిన తర్వాత మతము పుట్టుకొచ్చినది. మతము లేనప్పుడు ధర్మములను చెప్పినట్లు మతమున్నప్పుడు చెప్పుటకు వీలగునా?**

**జవాబు :-** మతమును మనుషులు పెట్టుకున్నారు. భగవంతుడు పెట్టలేదు కదా! భగవంతుడు చెప్పిన బోధనే ప్రత్యేకమయిన మతముగా చెప్పుకొను చున్నారు. అందువలన ఏ మత బోధనయినా సులభముగా చెప్పు భగవంతునికి మతము అడ్డము రాదు.

**ప్రశ్న :- కృష్ణుడుగా భగవద్గీతను చెప్పియున్నాడు, కావున భగవద్గీతా జ్ఞానమును గానీ, దానిలోని ఏ ప్రశ్నకయినాగానీ జవాబును చెప్పవచ్చును. అలాగే ఏసుగా చెప్పినప్పుడు అదే బైబిలుగా మారినది, కావున బైబిలు జ్ఞానమునుగానీ, బైబిలులోని ఏ ప్రశ్నకయినా జవాబునుగానీ సులభముగా చెప్పును. ఎందుకనగా! భగవద్గీతను, బైబిలును ఆయనే చెప్పాడు కావున ఏ మతములోని ప్రశ్నకయినా జవాబును చెప్పును. అయితే ఖురాన్ గ్రంథమును తాను చెప్పలేదు. దానిని జిబ్రయేల్ (సూర్య) గ్రహము చెప్పినది. అందువలన ఖురాన్ గ్రంథములోని జ్ఞానమునుగానీ, దానిలోని ప్రశ్నకు జవాబును గానీ భగవంతుడు చెప్పగలడా?**

**జవాబు :-** ఆకాశవాణి జ్ఞానమును సూర్యగ్రహము విన్నదని, దానినే ఇప్పుడు చెప్పుచున్నానని కృష్ణుడు అర్జునునకు భగవద్గీత రూపములో సూర్యుడు చెప్పిన జ్ఞానమునే చెప్పాడు. అదే సూర్యుడు (జిబ్రయేల్) చెప్పినదే ఖురాన్ గ్రంథమగుట వలన, అందులోనిది భగవద్గీత జ్ఞానమగుట వలన దానికి కూడా సులభముగా జవాబు చెప్పగలడు. మూడు గ్రంథములు దైవగ్రంథములే అగుట వలన దైవము అయిన భగవంతుడు ఎందుకు చెప్పలేడు? దేనికయినా జవాబు ఇచ్చును.

**ప్రశ్న :- నేడు భూమిమీద మూడు ముఖ్యమైన మతములున్నవి. తొమ్మిది ముఖ్యముగాని మతములున్నవి. మొత్తము పన్నెండు మతములున్నవి. ఈ దఫా దేవుడు భగవంతుడను మారువేషముతో భూమిమీదికి వస్తే ఏ మతములో పుట్టవచ్చును?**

**జవాబు :-** భగవంతునికి మతము ఉండదు. ఆయన పుట్టిన భౌతిక తల్లి తండ్రులకు మతముండును. అందువలన హిందూమతములోని తల్లి

తంద్రులకే ఆయన పుట్టునని చెప్పవచ్చును. ఇంతకు ముందు రెండుమార్లు హిందువుల (ఇందువుల) మతమునకు సంబంధించిన తల్లితంద్రులకే పుట్టాడు. అట్లే ఇప్పుడు కూడా హిందువు ఇంటిలోనే పుట్టునని చెప్పవచ్చును.

**ప్రశ్న :- తమకు భగవంతుడు పుట్టాడని తల్లితంద్రులకు కొద్దిగా అయినా తెలుసునా? తెలియదా?**

**జవాబు :-** తెలిస్తే దేవుని గుట్టు బయటపడుతుంది. అందువలన తెలియదనియే చెప్పాలి. కృష్ణుని జన్మలో అక్కడ తల్లితంద్రులయిన దేవకీ, వసుదేవులకు తమ కడుపులో గొప్ప వ్యక్తి పుట్టాడని తెలుసు. అయితే దేవుడు వచ్చి భగవంతునిగా పుట్టాడని తెలియదు. ఏసుప్రభువుగా వచ్చినప్పుడు కూడా అంతే తెలిసియుండును. అయితే మూడవమారు వచ్చునప్పుడు ఉండే తల్లితంద్రులకు తమ బిడ్డ గొప్పతనమును గురించి ఏమాత్రము తెలియదు. పైగా ఈ మారు వచ్చు భగవంతుని తల్లితంద్రులు పరమ మూర్ఖులుగా, అజ్ఞానులుగా యుందురు. వాస్తవముగా చెప్పాలంటే వారు ఏ జ్ఞానము లేని జంతువులతో సమానము. బాహ్యపూజలు చేయనని చెప్పిన భగవంతున్ని తమ మాట వినలేదని చంపాలని చూచు మూర్ఖులుగా ఉందురు. మనుషులలోని అజ్ఞానులలో పూర్తి చివరివారుగా యున్న వారిని తల్లితంద్రులుగా ఎంచుకొని భగవంతుడే వారి కడుపున పుట్టును గానీ వారి అదృష్టము కొద్ది భగవంతుడు వారి కడుపులో పుట్టడు. దేశమంతా భగవంతుని గొప్పతనమును చెప్పగా, ఆయన తల్లితంద్రులు మాత్రము ఆయన ఎంతో చెడ్డవాడని ప్రచారము చేయువారైయుందురు.

**ప్రశ్న :- ఈ మారు భగవంతునికి బంధువులుగానీ, అన్నతమ్ములుగానీ ఉంటారా?**

**జవాబు :-** అందరూ ఉంటారుగానీ ఎవరితోనూ ఆయనకు సంబంధము ఉండదు. ఆయనను చూచి అందరూ అతనితో మాకు సంబంధము లేదని

చెప్పుదురుగానీ అతను మావాడని ఎవరూ చెప్పరు. భగవంతుని జ్ఞానము వారికి సరిపడదు. అందువలన ఎవరుగానీ ఆయనతో సంబంధపడి యుండరు. ఈ మారు భగవంతుడు ఎవరి సంబంధము లేనివాడై ఉండును. చివరికి భార్య కూడా ఆయనవద్ద ఉండదు. అమ్మ సంబంధముగానీ, నాన్న సంబంధముగానీ, భార్య సంబంధముగానీ, అన్నతమ్ముల సంబంధముగానీ, ఎవరి సంబంధము లేనివాడైయుండును.

**ప్రశ్న :- దేవుడు భగవంతునిగా పుట్టితే తర్వాత జన్మలో వస్తానని చెప్పి పోయిన సందర్భము భగవద్గీతలో గలదు. అట్లే బైబిలులో గలదు. అధర్మములు వృద్ధి చెందినప్పుడు తిరిగి వస్తానని కృష్ణుడు చెప్పాడు. అలాగే ఏసు ఆదరణకర్తగా వస్తానని చెప్పాడు. మూడవ మారు వచ్చు భగవంతుడు తన తర్వాత జన్మను గురించి చెప్పునా?**

**జవాబు :-** ఆ రెండు జన్మలలో ముందే చెప్పినా ఆ జన్మలను ఎవరూ గుర్తించలేదు. ఆదరణకర్త ఇంతవరకు ఎవరో తెలియదు. తర్వాత ఎవరూ గుర్తించుటకు కూడా వీలులేదు. ముందు వచ్చిన భగవంతుడు చెప్పి యున్నట్లు ఇప్పుడు మనకు తెలియుట వలన ఈ మారు అలా చెప్పితే ఇప్పటి భగవంతున్ని సులభముగా గుర్తించుటకు వీలున్నది. కావున ఈ మారు భగవంతుడు తన రెండవ జన్మను గురించి చెప్పడు.

**ప్రశ్న :- రెండువేల సంవత్సరముల పూర్వము ఏసుగా వచ్చినప్పుడు దేవుడు ఆదరణకర్తగా వస్తాడని చెప్పాడు. దీనినిబట్టి ఆదరణకర్త యనగా రాబోయే భగవంతుడని మాకు అర్థమయినది. చెప్పి రెండు వేల సంవత్సరములు అయినది. ఆదరణకర్తగా వచ్చు భగవంతుడు ఎప్పుడు వస్తాడని లెక్కించాలి. ఆదరణకర్త వచ్చిపోయాడా? వస్తాడా?**

**జవాబు :-** కొన్ని విషయములు మాకు తెలిసినా మేము చెప్పము. అవి

దైవ రహస్యములుగానే ఉండవలెనని అనుకొందుము. ఆదరణకర్త విషయము తెలియదని ఇంతకుముందే చెప్పాము. అయినా నీవు అడిగావు. దానిని గురించి నేను చెప్పునది ఏమనగా! భగవంతుడయిన ఆదరణకర్త వచ్చిపోయివుండవచ్చును, లేక వచ్చియుండవచ్చును, లేక త్వరలో రావచ్చును అని మాత్రము చెప్పగలము. అంతతప్ప ఏమీ చెప్పలేము.

**ప్రశ్న :- భగవంతునికి ఆరు లక్షణములుంటాయని కొందరంటున్నారు. ఆ ఆరు లక్షణములు ఎక్కడున్నవో వానిని భగవంతుడని గుర్తించవచ్చును కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ఈ మాటను వింటే నవ్వువస్తుంది గానీ మాటలు రావు. కొందరు భగవంతునికి ఆరు లక్షణములుండునని చెప్పారు. అవి వరుసగా 1) ఐశ్వర్యము 2) వీర్యము 3) కీర్తి (యశము) 4) శ్రీ 5) జ్ఞానము 6) వైరాగ్యము అని చెప్పారు. ఇవి భగవంతుని లక్షణములయితే భగవంతున్ని సులభముగా గుర్తించవచ్చును. దేవుడు దేవులాడబడేవాడయితే భగవంతుడు ప్రక్కలోనేయున్నా అతనిని కనుగొనలేము. ఒకవేళ నేనే భగవంతుడనని చెప్పినా ఆయనను ఎవరూ గుర్తించలేరు. దేవున్ని గానీ, భగవంతున్నిగానీ ఎవరూ గుర్తించలేరు... దేవుని రాకకు సమయమునే గుర్తించలేని వారము భగవంతున్ని గుర్తించగలమా???

# సమాప్తము

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

